28.4.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:17 విడిప్రతి:రు-2.00లు

Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



# ఐదు అధికార కేంద్రాలుగా తెలుగుదేశం!

తెలుగుదేశం పార్టీలో అధికార కేంద్రాలు పెరిగి పోవటంతో పరిపాలనలో గందరగోళ పరిస్థితి నెలకొంటుంది. గతంలో ఎన్టీరామారావుతో పాటు ఇద్దరల్లుళ్లు అధికార కేంద్రాలుగా వుండేవారు. లక్ష్మీపార్వతి ప్రవేశంతో మరో కొత్త అధికార కేంద్రానికి శ్రీకారం చుట్టబడింది. టెక్కలి సీటు గొడవతో ఎన్టీఆర్ మూడో కుమారుడు హరికృష్ణ రంగ ప్రవేశంతో మరో కొత్త అధికార కేంద్రం ఏర్పడింది. పంచేంద్రియాల్లాగా పార్టీలో నెలకొన్న ఈ అయిదు అధికార కేంద్రాలు ప్రభుత్వానికి, పరిపాలనకు కాళ్లు, కళ్లు, ముక్కు, చెవి, నాలుకలాగా తయారయ్యాయి. ఎటొచ్చీ వీటికి కేంద్ర స్థానమంటూ ఏదీ లేక పోవటంతో ఎవరి దారి వారిది అన్నట్లుంది. ఈ అధికార కేంద్రాల నుంచి ఆదేశమొస్తే అధికారుల గుండెలు గుభేలంటున్నాయి. ఫలానా అధికారకేంద్రం నుంచి ఒక వ్యక్తి ఒక పైరవి చేయించుకుంటే దానికి కౌంటర్‌గా ప్రత్యర్థి మరో అధికార కేంద్రాన్ని ఆశ్రయించి సదరు పైరవీని రద్దు చేయిస్తున్నాడు. "బాబు గారి వద్ద నుంచి ఫోన్ వస్తే ట్రాన్స్‌ఫర్ చేశాను. ఈ లోగా అమ్మ గారి వద్ద నుంచి ఫోన్ ఆదేశాలు రావటంతో రద్దు చేయాల్సి వచ్చింది. అమ్మగారి అనుగ్రహానికి పోతే బాబుగారి ఆగ్రహానికి గురి కావల్సి వచ్చింది. అడకత్తెర్లో పోకచెక్కలాగా తయారైంది మా పరిస్థితి" అంటూ ఓ ఉన్నతాధికారి వ్యక్తం చేసిన ఆవేదన వెనుక అధికారకేంద్రాల పాత్రను మనం అర్థం చేసుకోవచ్చు. రాష్ట్రంలో ఉన్నతాధికారుల బదలీ వెనుక కూడా ఈ అధికార కేంద్రాల ప్రభావం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. ఎన్టీఆర్ పెద్దల్లుడు ఇచ్చిన జాబితా చిన్నల్లుడి దెబ్బకు తారుమారవుతోంది. దీంతో పెద్దల్లుడ్ని ఆశ్రయించిన మంత్రులంతా ఒక్కొక్కరే ఎంచక్కా జారుకొని లక్ష్మీపార్వతి శరణువేడు

## అడకత్తెరలో ప్రభుత్వ అధికారులు

తున్నారు. మరికొంత మంది ఊగిసలాటలో వున్నవారు హరికృష్ణ నాయకత్వం జిందాబాద్ అంటున్నారు. మంత్రిగారు స్వతంత్రించి నిర్ణయాలు తీసుకునే పరిస్థితి దాదాపు కరువైంది. ఒక ఫైలు మీద సంతకం పెట్టే ముందు దాని పూర్వాపరాలు పరిశీలించి అది ఏ అధికార కేంద్రానికి సంబంధించిందో తెలుసుకొని గాని సంతకం పెట్టటం లేదు. గతంలో సమాంతర అధికారకేంద్రాలుగా అల్లుళ్లు పెట్టిన అంగళ్లను దెబ్బ తీయటానికే ఎన్టీఆర్ కొత్త అధికార కేంద్రాలకు "ఊతం" ఇస్తున్నారని అంటున్నారు. హరికృష్ణ గొడవ లేకపోతే టెక్కలి నుంచి లక్ష్మీపార్వతి పోటీచేసి, గెలిస్తే మంత్రి అయివుండేది. అయితే ముద్దుల అర్థాంగి "చిన్న" కోరికను తీర్చలేకపోయిన ఎన్టీఆర్ ఇప్పుడు పార్టీలో పార్వతికి పెద్ద పీట వేసి ఆ లోటును తీర్చాలన్న నిర్ణయానికి వచ్చారు. అలాగే రక్త సంబంధాన్ని తెగతెంపులు చేసుకోవటం ఇష్టం లేక 'హరికృష్ణ'కు తెలుగు యువత పదవి ఇచ్చి జనంలోకి వదిలే ప్రయత్నంలో వున్నారు. దీంతో పార్టీ పై చంద్రబాబుకున్న పట్టును లక్ష్మీపార్వతి ద్వారా ఊడబెరకవచ్చు. అలాగే తెలుగు యువతను తానొక్కడినే ప్రతినిధి అంటూ ఇంత కాలం యువతను గుప్పెట్లో పెట్టుకున్న పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వర రావును నిస్సహాయునిగా చేయవచ్చని ఎన్టీఆర్ భావిస్తున్నారట.

## నిన్న వందల కోట్లకు అధిపతి; నేడు ఏమీ లేని బికారి!

# షేర్ మార్కెట్‌లో వ్యక్తుల పతనం ఎంత శీఘ్రం?

వ్యాపార ప్రపంచం విచిత్రమైనది. అందులోనూ షేర్ మార్కెట్ మరీ చంచల స్వభావి. అది ఏరోజు ఎవర్ని అందలం ఎక్కిస్తుందో, ఏరోజు ఎవర్ని అధఃపాతాళానికి తోసేస్తుందో ఊహించడం ఎవరి తరమూ కాదు. రాత్రి మహారాజులుగా వున్నవారు, తెల్లవారే సరికి బికారులుగా మారి పోతుంటారు; నిన్న సైకిల్‌పై తిరిగినవారు రేపటికి విమానాలలో ఎగురుతుంటారు. ఏది ఎప్పుడు జరుగుతుందో, ఎవరు ఎప్పుడే రూపంలో కన్పిస్తారో ఊహించడం దుర్లభం.

షేర్ మార్కెట్ అనుపానులు అవలోకనం చేసుకొన్న వ్యక్తులు, పారిశ్రామిక వేత్తలు అక్కడ కన్పించే అవకాశాలను వదులు కోవడానికి ఇష్టపడరు. ఆ అయస్కాంత ఆకర్షణను నిలువరించాలంటే నరుడిని పైన బడినా చలించని ప్రవరాఖ్యునంత నిగ్రహం కావాలి. అది ఎందరికి సాధ్యం?

ఈరోజు దేశంలోని అన్ని ప్రధాన వ్యాపార పత్రికలలోనూ పతాక శీర్షికలలో దర్శనమిస్తున్న ఎం.ఎస్. షూస్ కంపెనీ అధినేత పవన్ సచ్‌దేవ అవిగ్రహం పాటించ లేకనే జైలు పాలైనారు; వ్యాపార సువర్ణజీవితం పాడు చేసుకున్నారు. దురాశ దుఃఖమునకు చేటు అన్న సూక్తికి ప్రత్యక్ష నిదర్శనం పవన్ సచ్‌దేవ.

రెండు నెలల క్రితం వరకు ఆయన చాలా విజయవంతమైన పారిశ్రామికవేత్త. తండ్రి బాటా చెప్పుల కంపెనీకి బూట్లు సరఫరా చేసేవాడు. దానితో సంతృప్తి చెందలేక తాను స్వంతంగా 1979లో ఒక కంపెనీ ప్రారంభించి చెప్పుల తయారీకి దిగాడు. ఏటేటా ఆ కంపెనీ టర్నోవర్ రెండు కోట్లు తాకింది. ఆ తర్వాత నాలుగేళ్లకు ముప్పయి కోట్లకు పెరిగింది. ఆ తర్వాత సరిగ్గా రెండేళ్లలో టర్నోవర్ నాలుగురెట్లు

**పవన్ సచ్‌దేవ, రాజన్ పిళ్లెల విచిత్రజీవితాలు!**

పెరిగి-120 కోట్లకు చేరుకున్నది. ఆదు విదేశీ కార్లు, విలాసవంతమైన జీవితం, అద్భుత పారిశ్రామిక విజయాలతో సుఖంగా వుండినాడు. ఆ దశలో దురాశ ఆవహించింది.

చిన్న తనం నుంచి సచ్‌దేవలో ఒక కోరిక వుండేదట- ఢిల్లీలోని ఒబ్రాయ్ అంత హోటల్ స్వంతం చేసుకోవాలని. ఆ ఆశ నెరవేర్చు కోవడానికి పూనుకున్నాడు. అదృష్టం కలిసి వచ్చి హుడ్కో ప్రకటించిన పెద్ద హోటల్ ప్రాజెక్టుకు టెండర్ వేసి సాధించాడు. దీనికి 456 కోట్లు కావాలి. అంతటితోను తృప్తి పడలేదు. షూలు తయారీ పరిశ్రమ ఒకటి పెట్టాలను కున్నాడు. దానికి మరొక 3,4 వందల కోట్లు కావాలి. నిజానికి ఈ నిధులు సేకరించడం అతనికి పెద్ద కష్టం కాదు. బ్యాంకులలో మంచి పరపతి వుంది. కానీ అత్యాశకు పోయాడు. బ్యాంకులలో తీసుకుంటే వడ్డీ కట్టవలసి వుంటుందనే వుద్దేశ్యంతో తేరగా దొరికే పబ్లిక్ మనీ సంపాదించాలను కున్నాడు. అక్కడా దురాశే. షేర్ ధరను సాధారణ ప్రీమియంతో విడుదల చేసి వుంటే పేచీ వుండేది కాదు. కానీ ఈక్విటీ తక్కువతో ఎక్కువ సొమ్ము సేకరించాలని 188 రూపాయల ప్రీమియం నిర్ణయింప జేశాడు. ఒకేసారి ఇంచుమించు 700 కోట్లు సంపాదించాలని ప్రయత్నించాడు.

ఎప్పుడైతే ఆశ పెరిగి, దురాశగా మారిందో దాన్ని నెరవేర్చు కోవడానికి తప్పుడు పనులు చేయక తప్పలేదు. అధిక ప్రీమియం సమంజసమేనని నిరూపించడానికి మార్కెట్‌లో తన షేర్లను తానే కొని రేటు పెంచడం ప్రారంభించాడు. 1993 లో ఆయన కంపెనీ షేరు ధర కేవలం 60 రూపాయలు. 94 సంవత్సరంలో క్రమ క్రమంగా దాన్ని రు.350 లకు పెంచాడు. ఇష్యూ విడుదల కావడానికి ఇరవై రోజుల ముందునాటికి రు.550లు చేశాడు.

మార్కెట్‌లో రు.550 లు వున్న షేరు, చీప్‌గా రు.200లకే పబ్లిక్ ఇష్యూద్వారా లభించ బోతున్న దన్న ప్రచారంతో జనాన్ని మభ్యపెట్టి, ఒకేసారి 700 కోట్లు సంపాదించాలన్నది ఆయన దుస్సంకల్పం. ఇటువంటి దుష్ట పనులు ఇది వరకు చాలా మంది చేశారు. ఎన్నో కంపెనీలు పబ్లిక్ ఇష్యూలకు ముందుగా ఒక పథకం ప్రకారం తమ షేర్లను తామే కొని రేట్లు పెంచి, ప్రజలను మభ్య పెట్టాయి. వారి అదృష్టం బాగుంది. దురదృష్టం కాలం కలిసి రాలేదు.

దురాశకు పోయి జైలు పాలైన పవన్ సచ్‌దేవ

తన రేట్ల ప్రచారం కోసం ఆయన టివికి విడుదల చేసిన ప్రకటన ఇన్వెస్టర్లను మభ్యపెట్టేదిగా వుందని

తరువ 8 పేజీలో

## ఎవరి నిర్ణయము?

ఎవరు నిర్ణయించారు నేను పుంగవానిగా పుట్టాలని; భారతదేశంలో ఆంధ్రదేశంలో, నెల్లూరు జిల్లాలో రైతు కుటుంబంలో పుట్టాలని.
ఏ వ్యక్తి, శక్తి నిర్ణయమిది? ఏ బ్రహ్మ తీర్మానమిది? పై విలాసం పూర్తిగ వ్రాసి పంపిన ఉత్తరం వలె. ఎవరు నన్ను పోస్టు చేశారు. ఎక్కడ నుంచి? నా తల్లి తండ్రులకు పుట్టానని అందరికి తెలుసు. కాని యీ నిర్ణయము వారిది కాదు. నా ముందు పుట్టిన నలుగురు అక్కల వలె, నేనూ ఆడదానిగా పుట్టి వుండవచ్చును. శిశువుగా పుట్టినా పెద్ద భవిష్యత్తుతో పుట్టిన వ్యక్తినే అయినానే. ఆ నిర్ణయం చేయడానికి నాకు ఉగలేదు. ఈ తర్పులో తల్లిదండ్రులకు, నాకు ఎటి సంబంధము లేదు. ఇండియాలోనే కాక వాంగుమూలో పుట్టి వుండవచ్చు గదా, అమెరికాలో, ముస్లిం దేశాలలో, చైనా, జపానులలో పుట్టి వుండవచ్చు. ఎవరు చుక్కాని పట్టి నేను అనే పడవను ఈ రేవులో లంగరు వేయించారు? నేను విశాలాంగుడనిగా జన్మించి వుండవచ్చు! అట్టి ప్రమాదం లేక సకలాంగాలు చక్కగానే అమరాయి గదా! బాల్యారిష్టాలు లేక బాగానే పెంగాను. బీదరికం కాని, కొంత వసతులలోనే, మనినాను. ఎవరు బాధ్యత వహించని నిర్ణయమా? పూర్వ జన్మ ఉన్నదను వారు నా పూర్వ జన్మ కార్య ఫలితమంటారు. పూర్వజన్మ లేదను వారు ఏమంటారో? జీవ శాస్త్ర నిపుణులు ఏమంటారో? కారణం లేని సంఘటన అంటారేమో! తర్కించడానికి ఏ లంలోని సిద్ధాంత పరా. రాద్ధాంతమా?
సరే కారణ రహితమైన వాస్తవమైతే ఎందుకు, నాకు ఇంత అభిమానమా? నా దేశం, నా భాష, నా మతమని అకారణ సంఘటనకు ఇంత అభిమానమా? ప్రాణాలు ధారపోసి దేశ విముక్తి అంటారే, విశ్వభాష లలోన తెలుగు లెస్స అంటామే, అగ్రకులాల వారమని అనాది మా సంస్కృతి అని బడాయిలు కొట్టతామే, ఈ అభిమానాలు, ప్రశంసలు అనౌచిత్యాలా? తప్పు త్రోవలో విహరించే మాయా హరిణాలా? తిప్పలేని గూడు చేరిన, కాంతి విహంగాలా? తాత్కాలిక ఆవేశమా, ఉన్మాదమా?
తర్కించరాని విషయమే తర్కించాను క్షమించండి.

**బెజవాడ గోపాలురెడ్డి**

# షేరు హోల్డర్లకు యూనిట్ ట్రస్ట్ కుచ్చు టోపీ!

**డాక్టర్ దుర్గాప్రసాద్**

యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా నుంచి 1964 సంవత్సరం నుండి ఇప్పటి వరకు అనేక స్కీంలు ప్రవేశ పెట్టి 55 వేల కోట్లు వసూలు చేసింది.

యూనిట్ 64, లావాదేవీలే 25 వేల కోట్ల వరకున్నాయి. ఈ స్కీం మీదే 16 శాతం పెట్టుబడి దారులకు అప్రిషియేషన్ వచ్చింది. మిగతా స్కీంలు కొన్నవారు నష్టపోయారు. 1992 లో మాస్టర్ గెయిన్ స్కీంకు ప్రజలు 4 వేల కోట్లు పెట్టుబడి పెట్టారు. ఈ మూడు సంవత్సరాల్లో 10 పైసలు వడ్డీ మాత్రమే వచ్చి పెట్టుబడి దారుడు విస్తుపోయాలే చేసింది. 1991 లో విడుదల చేసిన మాస్టర్ ప్లస్ పెట్టుబడులు వెయ్యి కోట్లు. యు.టి.ఐ. ఏదో కొత్త పేరు పెట్టి ప్రజల నుండి వేల కోట్లు వసూలు చేస్తుంది. మార్కెట్లో, షేర్ల విలువ తెలుసు కోకుండా పెట్టుబడి పెట్టి ప్రజలు మోస పోతున్నారు. దేశ వ్యాప్తంగా యుటిఐకి వున్న 90 వేల మంది ఏజంట్లు దరఖాస్తు దారులను వాళ్ల కమీషన్ కోసం అర చేతిలో వైకుంఠం చూపిస్తున్నారు. గ్రామీణ ప్రాంత ప్రజలు మంచి చెడూ ఆలోచించక పెట్టుబడి పెట్టి చతికల బడుతున్నారు.

ఆరు నెలల క్రితం రిలయన్స్ షేర్లు 750 కోట్లు ప్రైవేట్ ప్లేస్‌మెంట్‌గా యుటిఐ వుంచుకొంది. ఈ రోజు వీటివల్ల 200 కోట్ల రూపాయలు నష్ట పోయింది. మార్చి 95 మొదటి వారం 15 లక్షల టెల్కో షేర్లు 525 రూపాయలకు కొని నెలఖారుకు 425 రూపాయలకు చాలా మంది అమ్మేశారు. దీనివల్ల యుటిఐలో పెట్టుబడి పెట్టిన వారు 15 కోట్లు నష్ట పోయారు. ఇంకో విచిత్ర మేమిటంటే ఈ టెల్కో షేరే ఏప్రెల్ మొదటి వారంలో 500 రూపాయాలకు యుటిఐ కొనడం మొదలు పెట్టింది. ప్రజల సొమ్ముకు జవాబుదారిగా వుండాల్సిన యుటిఐ చేయాల్సిన పని కాదిది.

పెట్టుబడి దారులకు యుటిఐ చేసే సేవలు ఇబ్బందిని నష్టాన్ని తెచ్చి పెట్టుతున్నాయి. 93 నవంబరులో మాస్టర్ షేరు యుటిఐకే అమ్మిన వారికి ఇంకా డబ్బులు రాలేదంటే ఎంత బాగా పనిచేస్తుందో అర్థమవుతుంది. వీళ్ల రిజిష్టార్‌లు లాయర్ నోటీసులు, రిజిష్టర్ జాబులకు లొంగే ఘటాలు కాదు. 95 మార్చిలో మాస్టర్ గెయిన్ పథకానికి బుక్ క్లోజర్ ఇచ్చారు. అభ్యంతరాల వల్ల వెనకకు తిప్పిన షేర్ల మొత్తం 800 కోట్ల వరకున్నాయి. మాస్టర్ గెయిన్ సర్టిఫికెట్లు బదలీల్లో విపరీతంగా ఆలస్య మవుతున్న కారణంగా ఏప్రెల్ 26 నుంచి మాస్టర్ గెయిన్ - 92 వ్యాపారాలను బొంబాయి స్టాక్ మార్కెట్‌లో నిలిపేశారు. ఇంతగా పెట్టుబడిదారులకు ఇబ్బంది పెడుతూనే యుటిఐ కొత్త షేర్లతో వెల వెలా మళ్లీ పబ్లిక్ ఇష్యూలు విడుదల చేస్తుంది. ఏప్రెల్ 4 తేది 'ప్రైమ ఈక్విటీ ఫండ్' స్కీం వచ్చింది. అయితే ఈ స్కీం తన లక్ష్యం 100 కోట్లు వసూళ్ల గాను 20 కోట్లే వచ్చింది. ఈ మొత్తాన్ని మే 2 తేదీలోగా వసూలు చేయకుంటే ఈ స్కీం రద్దవుతుంది. కాని కంపెనీ పేరు ప్రఖ్యాతుల కోసం ఏదో ఒక గోల్‌మాల్ చేయను నిర్వాహకులు, పథకాలు సిద్ధం చేసుకొనే వుంటారు.

(తరువ 8 పేజీలో)

# కుటుంబ పాలన

తెలుగుదేశం పార్టీలో జరిగిన, జరుగుతున్న పరిణామాలను చూస్తుంటే ఆందోళన కలుగుతోంది; విచారం వ్యక్తం చేయవలసి వస్తోంది. టెక్కలి శాసన సభ ఉప ఎన్నిక చాలా చిన్న విషయం. కానీ అది ఆ పార్టీలో, ఆ పార్టీ అధినేత కుటుంబంలో పెను రాజకీయ తుఫాన్ రేపింది. దాని ప్రభావం మొత్తం రాష్ట్ర రాజకీయాల పై ప్రసరించింది; ప్రభుత్వ నిర్వహణను స్తంభింప జేసింది. నెల రోజుల పాటు ఏడు కోట్ల ఆంధ్రులకు ఇదే జీవన్మరణ సమస్య అన్నట్లు ఎక్కడకు వెళ్లినా ఇదే చర్చ; ఇదే రచ్చ. దినపత్రికలు, స్పెషల్ ఎడిషన్లు, ప్రత్యేక ఇంటర్వ్యూలు ప్రచురించి పండగ చేసుకున్నాయి. సెక్రెటేరియట్‌లో ఒక్క పైలు కదలలేదు. మంత్రులు అటూ, ఇటూ చేరి కాలు గాలిన పిల్లులవలె పరుగులు పెట్టారు. ఎమ్మెల్యేలు ఎటువుంటే ఏమి పేచీయోనని తల్లడిల్లి పోయారు. పరిక్లిష్ట సవాళ్లు, లక్ష్మీపార్వతి బుడి బుడి దీర్ఘాలు; ఎన్టీఆర్ మేకపోతు గాంభీర్యపు ప్రకటనలతో జనానికి వెర్రెత్తించారు.

అపూర్వము, అనూహ్యము, అనితర సాధ్యమైన ప్రజాదరణతో అధికారంలోకి వచ్చిన తెలుగు దేశం పార్టీ, దాని అధినేత ప్రవర్తించ వలసిన తీరు ఇదేనా? వారి నుంచి ప్రజలు ఆశించింది ఇంతేనా? రాజకీయాన్ని కుటుంబానికి, ప్రభుత్వాన్ని అంతః పురానికి పరిమితం చేసి పరిపాలించడానికి ఎవరిచ్చారీ అధికారం? ఒకే కుటుంబం నుంచి పలువురు సభ్యులు రాజకీయాలలో మనుగడ సాగించడం మనకేమీ కొత్త కాదు. కానీ ఆ నలుగురు సభ్యులే సర్వస్వం అన్న రీతిలో ప్రవర్తించడం ఇప్పుడే చూస్తున్నాము. తన కుమార్తెను రాజకీయాలలోకి ప్రవేశ పెట్టినప్పటికీ జవహర్లాల్ నెహ్రూ ఎప్పుడూ తన కుటుంబ అవసరాల కోసం పార్టీని, ప్రభుత్వ విధానాలను ఫణంగా పెట్టలేదు. ఆయనలో ఆ బలహీనత వుంది. వుంటే ఫిరోజ్ గాంధీ దూరమై వుండే వాడు కాదు. అల్లుడు కోరినట్లు ప్రభుత్వ విధానాలు, కార్యక్రమాలు మారిపోయి వుండేవి. తాను పదవిలో వున్నంత కాలం తన కుమారులను తనకు సహాయకారులుగా వాడుకున్నారే తప్ప, స్వర్గీయ ఇందిరమ్మ, వారినెప్పుడూ ప్రభుత్వ పదవులలో నియమించ లేదు. అమెది కుటుంబ పాలనని, అను వంశిక పాలనని కాకిగోల చేసిన ప్రతిపక్షాలు ఎన్టీఆర్ విషయంలో నోరు మెదపక పోవడం విచారకరం. ఒక పార్టీ అధినేత కుటుంబ సభ్యులైనంత మాత్రాన రాజకీయాలలోకి రావడానికి ఎవర్నీ అభ్యంతర పెట్టలేము. కానీ వారు తమ వ్యక్తిగత పలుకుబడి, ప్రవర్తనతో ప్రజల ఆదరణ పొందాలే తప్ప, కేవలం తమ బంధుత్వాలనుపయోగించి ప్రజల పై పెత్తనం చేయదలిస్తే అది ఫ్యూడలిజం అవుతుందే తప్ప ప్రజాస్వామ్యం కానేకాదు; ప్రజలు క్షమించరు.

ఎన్టీఆర్‌ను గద్దె నెక్కించింది తెలుగుదేశం పార్టీకి అంత విశేష మెజారిటీ సంతరించి పెట్టింది తమలో తాము తన్నుక చావమని కాదు; తమ కుటుంబ సభ్యుల అలుకలు తీర్చి, ఆగ్రహాలు ఉపశమింప జేయమనీ కాదు; సక్రమమైన విధానాలతో, సత్శీలతతో పరిపాలన చేయమని! అంతః కలహాలతో జుట్టు జుట్టు పట్టుకొని భ్రష్టు పట్టిస్తున్నారని కాంగ్రెస్ పార్టీని తిరస్కరించి, తెలుగుదేశాన్ని గద్దెనెక్కిస్తే వీరు అంతఃపుర కీచులాటలతో రభస సృష్టించడం ప్రజల అభీష్టాన్ని అపహాస్యం పాల్జేయడమే అవుతుంది.

అధికారంలోకి వచ్చిన ఐదు నెలలలోనే అంతా అయి పోయిందన్న అపఖ్యాతి నార్జించారు ఎన్టీ రామారావు గారు. మండల, మునిసిపల్ ఎన్నికలలోనే ప్రజల అయిష్టతను చవిచూశారు. ప్రజల అయిష్టత అసహ్యంగా మారకముందే ఆయన తన ప్రవర్తనను మార్చుకోవడం చాలా అవసరం. తన పార్టీలో, ప్రభుత్వంలో ఆయన ఇప్పటికే ఇద్దరు అల్లుళ్లను పై స్థానాన వుంచారు. అది చాలదన్నట్లు తన నూతన సతీమణిని, పెద్ద కుమారుణ్ని, చిన్న మనుమణ్ని, ముద్దుల మునిమనుమణ్ని సైతం పెత్తందారులుగా చేయ సంకల్పిస్తే ఆయన జీవితంలో మర్చిపోలేని గుణపాఠం ఎదుర్కోవలసి వుంటుంది. ఏ అర్హత వున్నదని ఆయన లక్ష్మీపార్వతిని ప్రజల ముందుకు తెస్తున్నారు? తను ప్రగాఢంగా ప్రేమించే ప్రేయసి కావడం ప్రజల పై పెత్తనానికి లైసెన్స్ పొందినట్లా? వ్యక్తిగత బలహీనతలకు అంత బాధ్యతాయుతమైన పదవిని, అపూర్వమైన ప్రజాదరణను ఫణంగా పెట్టడం మహాపరాధం! ఇప్పటికైనా ఆయన తన ప్రవర్తనను మార్చుకోవాలి; విజ్ఞత సంతరించుకోవాలి; ఒక కుటుంబ పెద్దగా కాక, ఒక రాష్ట్రాధినేతగా వ్యవహరించడం నేర్చుకోవాలి. ఆయనలో ఆ మార్పు రాకుంటే ప్రజలే తమ నిర్ణయం మార్చుకుంటారు. దానికి పెద్ద వ్యవధి కూడా లేదు.

జమీన్‌రైతు

---

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

జమీన్‌రైతు

27.4.1945

పేజీలు : 4 వెల : 0-1-6

### నెల్లూరు ముచ్చట్లు

#### బొగ్గు - కట్టె

నెల్లూరు టవున్‌లో కట్టె బొగ్గుకు కరువుగా వుంది చాలడం లేదు. బొగ్గు సప్లయి మరీ తక్కువగా వుంది. హోల్‌సేల్ డీలర్లే బొగ్గును మద్రాసుకు సప్లయి చేస్తుంటే యిక అనుకోవల సిందేమున్నది? అసలు పంచాయితీ కూపుల్లో బొగ్గు గాల్చి మద్రాసు యెగుమతికి పోతున్నది. అసలు నెల్లూరులో అమ్మే బొగ్గు జూస్తె రెండు వంతులు బొగ్గు పొడిన్నీ, ఒక వంతు బొగ్గులు ఉన్నవి. ఈ సాయంత్రం ఒక రహస్యం వినవచ్చింది. టవునులో ఒక ఆసామి వద్ద రు 800 లకు బొగ్గుపొడి కొన్నారట బొగ్గులలో కలపటానికి. "అంధేకాదర్బార్ పిత్తల్ కా దర్‌వాజా" గా వున్నది యీ కథ జూస్తుంటే. అధికార్లు యీ మాయమర్మాలు గమనించి టవున్ సప్లయి విషయంలో జాగ్రత పడుదురు గాక!

#### అవీ - ఇవీ

కలిగిరి రిజర్వాయర్ క్రింద రెండో కారు నీళ్లు లేక దెబ్బ తింటున్నది.

చేపలు 23 వేలకు యాలం పోశారు.

చేపలు ఏమన్నా నీళ్లు త్రాగుతున్నవా? సాంబశివా! మహాప్రభో! చాపలు నీళ్లు త్రాగితే అల్లారి కన్నా లభించాలనే? ఆ ఖర్మ వున్నట్లు లేదంటాడు ఒక అధికారి. యీ కథమేటి కలెక్టరు గారు విచారించ వలెను.

* * *

ఆరు మాసాల నాడు గోధుమ రవ్వ వచ్చి తుప్పు పట్టి పోతున్నది: యింత వరకు ధర తాడు తెగలేదట.

* * *

నరశింహ పురంలో వుండే ఆకుల వారి సత్రం రిపేరులకు, తిరుణాళ్ల ఖర్చులకు సహాయ మర్థిస్తున్నారు. మరియూ యీ భారాన్ని యింకెవరన్నా నెత్తిన బెట్టుకొంటే సంతోషిస్తామనీ గూడా ధర్మకర్తలంటున్నారు.

-విమర్శకుడు

#### సరకు సరియైనది లేనప్పుడు ప్రకటించడం అనవసరం

*మరల పేపరులో ప్రకటించామంటె నవ్వివాసనల. వింత ప్యాషనుల కొత్త రకాలు వచ్చినవి అన్న మాటే! కాబట్టి మరల ఒక మారు దయచేయండి.*

*ట్రంకురోడ్డు, భారతిమార్టు, నెల్లూరు*

N.B. సరకు కావలసినంత దొరకడం దుర్లభం కాబట్టి అందరకు సమంగా పంపకం జరుగు లాగున ప్రతివారు వీలైనంత తక్కువగా కొనమని మనవి.

#### నాటకాల పురాణం

తపసంహారి తపస్విని సింహపురిమ తల్లి గుర్తించి గౌరవించి, సన్మానించింది. తన సుతుల విద్య పెంపును రాణింప జేసింది. దీనికి తార్కాణం పురమందిరంలో నెల్లూరు మ్యూజిక్ అకాడమీ యాజమాన్య

(కొరవ 8 పేజీలో)

---

# అశ్లీలం పై నెల్లూరు నారీమణులు వుద్యమించాలి!

స్త్రీలు లేని వాణిజ్య ప్రకటనలు, టివిల్లో, సినిమాల్లో పత్రికల్లో అసలు కనపడడమే లేదు. వినియోగదారుడిని ఆకర్షించను ఉత్పత్తిదారులకు స్త్రీ సాధనమా? ఈ ప్రకటనల్లో స్త్రీని అర్థ నగ్నంగా చూపిస్తూ సొమ్ము చేసుకొంటున్నారు. ఈ విషయాన్ని పట్టించుకొని తగిన చర్యలు తీసుకొనే దమ్ము ప్రభుత్వానికి లేకుండా పోయింది. ఇటీవల టౌన్‌లో బహిరంగ ప్రదేశాల్లో ప్రదర్శిస్తున్న కొన్ని సినిమా వాల్‌పోస్టర్లు స్త్రీలను రోడ్ల పై నడవకుండా చేస్తున్నాయి. రైల్వే స్టేషన్, బస్టాండ్స్, బుక్ స్టాల్స్‌లో కూడా అసభ్యకరమైన పుస్తకాలు అమ్ముతున్నా పట్టించుకొనే వారే లేరు. ఇవి యువతను ఎంత పెడత్రోవ పట్టిస్తున్నాయో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. ప్రభుత్వం ఈ విషయాలను సీరియస్‌గా పట్టించుకోవాలి. లేకుంటే సారా వుద్యమం చేపట్టి ప్రపంచ దృష్టిని ఆకర్షించిన సింహపురి మహిళలు మరో వుద్యమంగా అశ్లీల వ్యతిరేక వుద్యమం చేపడితే బాగుంటుంది.

నెల్లూరు -కె. అరుణ

### కోర్టుల ఆవరణలో కక్షిదారులకు వసతి!

ఈ రోజుల్లో ఎయిరో డ్రోంలో, రైల్వే స్టేషన్లలో, బస్టాండుల్లో, అంతెందుకు ఏ ఆఫీసుకు పోయినా, వచ్చిన వారు వేచి వుండేందుకు అన్ని వసతులతో వైయిటింగ్ సౌకర్యాలు కల్పించ బడ్డాయి. కాని కోర్టుల్లో న్యాయాధిపతులు, న్యాయవాదులు, వుద్యోగులకు మాత్రమే వెయిటింగ్ రూంలు వున్నాయి. ఎంతో న్యాయ ప్రయాసల కోర్చి కోర్టులకు న్యాయం కొరకు వచ్చే వారికి వేచి యుండే వసతి లేదు. న్యాయస్థానాలు నడపడానికి న్యాయవాదులు సమాజంలో గౌరవంగా బ్రతికేందుకు కారణభూతులైన కక్షిదారులను మాత్రం ఎండనక వాననక చెట్ల క్రింద పడిగాపులు పడే బాధ వర్ణనాతీతం. వారికి కూడా తగు వసతి కల్పించాలి.

గూడూరు -పి.వి. ప్రభాకర రావు

## జనవాణి

### మాటి మాటికి కులం మారుతుందా?

వివిధ శాఖల్లో ఖాళీల భర్తీతో పాటు, పోటీ పరీక్షలు నిర్వహిస్తున్న ప్రభుత్వం కుల సర్టిఫికెటు పొందు పరిచే విషయంలో లేని పోని ఆంక్షలు విధిస్తోంది. పరీక్షలను వ్రాసే విద్యార్థి ప్రతిసారి మళ్లీ కులం సర్టిఫికెటు జత పరచాలి. మాటి మాటికి ఏ వ్యక్తి కులమైనా మారుతుందా? ఎంప్లాయిమెంట్, బస్ పాస్‌లు, రైల్వే పాసుల్లా కులం సర్టిఫికెట్లను రెన్యూవల్ చేసుకోవాలనడం బాగోలేదు. సర్టిఫికెట్ కోసం ఎమ్మార్వో ఆఫీసుకు వెళితే అక్కడి వుద్యోగులను ఒప్పించి సంతకం పెట్టించను పడే రిస్కు అంతా, ఇంతా కాదు. ఒక వ్యక్తికి ఒకసారిచ్చిన సర్టిఫికెట్‌లోని కులం ఆ వ్యక్తి జీవితాంతం మారదన్న విషయం ప్రభుత్వ అధికారులు గమనించని విషయమా? ఈ విధానం మార్చితే బడుగు వర్గాలను తిప్పల నుంచి తప్పించిన వారవుతారు.

ఆత్మకూరు -కె.హరినారాయణ

### టి.టి.సి. ధరఖాస్తు గడువు పెంచాలి!

టీచర్ ట్రైనింగ్ ప్రవేశ పరీక్షకు దరఖాస్తు దాఖలు చేసు కోమనేందుకు గడువు పెంచాలి. ఈ ప్రకటన

(కొరవ 10 పేజీలో)

# తొలి సమావేశంలోనే శుభశకునం!

25 తేదీ జరిగిన మునిసిపల్ తొలి సమావేశంలోనే ఛైర్మన్‌గా ఆనం వివేకానంద రెడ్డి తన పట్టు నిలుపుకొన్నారు. సిపిఎం కౌన్సిలర్లు ఉన్నం బసవయ్య, మాదాల వెంకటేశ్వర్లు, స్వతంత్రుడు సందాని బాషా ఎక్కుపెట్టిన విమర్శనాస్త్రాలను తనదైన

### ప్రతిపక్షాలకు పట్టు చిక్కనీయలేదు

బాణీలో ఎదుర్కొని విజయునిగా నిల్చాడు. ఒకానొక సమయంలో కౌన్సిల్‌లో వుద్రిక్త వాతావరణం నెలకొన్నా వివేకా సహనం కోల్పోక సంయమనంగా సమాధాన మిచ్చాడు. కౌన్సిలర్‌గా, వైస్ ఛైర్మన్‌గా ఇంతకు ముందు పనిచేసిన అనుభవం వివేకా విజయ రహస్యమేమో! కౌన్సిల్‌లోని సభ్యుల్లో ఎక్కువ మంది కొత్త వారు కావడంతో ప్రవేశ పెట్టిన 121 తీర్మానాల్లో 20 తీర్మానాల పై కూడా రసవత్తర చర్చ జరగలేదు. పాత కాపులు ఉన్నం బసవయ్య, శ్రీమన్నారాయణ, సందాని బాషా, ఊటుకూరు లక్ష్మయ్య, లక్ష్మికుమారిలకు పాత అనుభవం పనికొచ్చింది. కొత్త

### కౌన్సిల్‌లో అందగాడు!

మునిసిపల్ కౌన్సిల్‌లో అందరి కంటె తానే అందగాడినని ఛైర్మన్ వివేకానంద రెడ్డి చెప్పుకొన్నారు. కౌన్సిల్‌లో చర్చ జరుగుతుండగా పలు అంశాల పై సి.పి.ఎం. కౌన్సిలర్ వున్నం బసవయ్య ప్రశ్నలు గుప్పిస్తూ సమాధానాల కోసం మునిసిపల్ కమీషనర్ వైపు, పత్రికల వారి వైపు చూడ సాగారు. అధ్యక్ష స్థానంలో వున్న వివేకాను ఈ చర్య చిన్న బుచ్చినట్లుంది. వెంటనే బసవయ్య గారు... కౌన్సిల్‌లో అందరుగుల అందగాడ్ని మీ కళ్లకు నేను కనపడడం లేదా? నన్ను అడగండి సమాధానాలు చెబుతానన్నారు.

వారిలో భానుశ్రీ, కనకయ్య, సుబ్బారావు మెలనిపించారు. ఏది ఏమైనా కౌన్సిలర్లు మౌన ప్రేక్షకుల్లా కాకుండా సిపిఎం పక్ష నాయకుడు మాదాల వెంకటేశ్వర్లులా తయారై వస్తే సమావేశాలు రంజుగా జరుగుతాయనడంలో సందేహం లేదు.

కౌన్సిల్ ప్రజారోగ్య శాఖకు సంబంధించి కేటాయించిన బడ్జెట్ మీద వాడి వేడిగా చర్చ జరిగింది. నీటి సరఫరా డిస్ట్రిబ్యూషన్ మెయిన్లు, ట్రంకుమెయిన్ల నిర్వహణకు మూడు లక్షల 80 వేల రూపాయల అంచనాల మంజూరు విషయమై స్వతంత్రుడు సందాని బాషా ఇంత మొత్తం ఎందుకు ఖర్చు అవుతాయని ప్రశ్నించాడు. ప్రతి తీర్మానాన్ని కౌన్సిల్ గుడ్డిగా అంగీకరిస్తూ పోతే మునిసిపల్ సిబ్బంది ముంచేస్తారని ప్రత్యేకాధికారి పాలనలో కోటి 50 లక్షలు పనులు జరుగకుండానే కొటేషన్లు స్వీకరించి స్వాహా చేసినట్లు ఆరోపించారు. దీనికి సంబంధించిన చెక్‌బుక్ ఓచర్లు 163 నుంచి 169 వివరాలు తన వద్ద వున్నట్లు చెప్పారు. నిధుల దుర్వినియోగమై విజిలెన్స్ దర్యాప్తు చేయించాలన్నారు. ఈ అంశం పై కొంత ఉద్రిక్తత ఏర్పడింది. క్యాష్ బుక్కులను సభ ముందుంచాలని సందాని గొడవ చేయగా ఈ విషయాన్ని పరిశీలించి దర్యాప్తుకు ఆదేశిస్తానని ఛైర్మన్ చెప్పారు. ప్రతి విషయాన్ని పరిశీలించే హక్కు సభ్యుల కుందంటూ

(కొరవ 12 పేజీలో)



గీతా వసంత నవ రాత్రుల ముగింపు కార్యక్రమంలో డా. ఉదాలి నరశింహ శాస్త్రిని సన్మానిస్తున్న శ్రీ కె. కామేశ్వర రావు. బి. సీతారామ శాస్త్రి, వాకాటి పెంచలు రెడ్డి ప్రక్కన వున్నారు.

# సణుగుడు

## * కులద్వేషం ప్రమాదకరం

నెల్లూరు మునిసిపల్ కమీషనర్ శ్రీ డివి రెడ్డిని బదలీ చేశారు. నిజానికి పెద్ద వార్త కాదు. అధికారులు వస్తుంటారు; పోతుంటారు. బదలీ అనేది వారి ఉద్యోగ ధర్మంలో ఒక భాగం. అందులోనూ డివి రెడ్డి ప్రత్యేకంగా పేర్కొన దగిన వ్యక్తి కూడా కాదు. నెల్లూరులో రెండేళ్లకు పై నుంచి వున్నాడనే కాని నెల్లూరుతో కాని, నెల్లూరీయులతో కాని సంబంధాలు పెంచుకోలేదు. మునిసిపల్ కమీషనర్‌గా సమర్థుడన్పించుకోలేదు. టౌన్ అభివృద్ధికి ఎటువంటి కృషి చేయలేదు. ఆయనకు నిజాయితీ పరుడనే సర్టిఫికెట్ కూడా ఇవ్వలేము. ఒక రకంగా చెప్పాలంటే ఎవరు ఛైర్మన్‌గా గెల్చినా ఆయన్ను మార్చి మరొక సమర్థుడ్ని తెచ్చుకోవాలని తల పెట్టి వుండేవారు. అటువంటి సాదా, సీదా అధికారిని బదలీ చేయడం పై వివాదం రేకెత్తుతున్న దంటే అందుకు కారణం బదలీ కాదు; బదలీ జరిగిన తీరు.

టెలిఫోన్‌లో ఆదేశాలు వచ్చాయి ఆయనకు - వున్న ఫళంగా ఛార్జి అప్పచెప్పమని; ఎక్కడకు బదలీ చేసింది తెలియదు; ఎందుకు చేసిందీ చెప్పలేదు. తిరిగి ఎపఎప్పుడు చెప్తారో కూడా తెలియదు. యు వార్ అండర్ అరెస్ట్ అన్నట్లుంది ఆ బదలీ శ్రీముఖం. ఆయన్నింత అవమాన కరంగా ఇంటికి పంపడానికి కారణం - మునిసిపల్ ఎన్నికలలో ఓడిపోయిన వైటి నాయుడు పట్టు పట్టడం. తను గెల్చినట్లు డిక్లేర్ చేయమని నయానా, భయానా చెప్పినా విన నందుకు ఈ శిక్ష వేయించాడు. లేని ఓట్లు వున్నట్లు కలిపి గెలుపు ప్రకటన చేయమంటే ఏ అధికారి రిస్క్ తీసుకుంటాడు? ఉద్యోగానికి ప్రమాదమే కాదు - ఎంత పెద్ద నేరం అది? అదే స్థానంలో తమ కులపోడు వుండి వుంటే తాము చెప్పిన మాట వినకుండా పోతాడా అన్నది తెలుగు నాయకుల ఆక్రోశం; డివి రెడ్డి తమ ప్రత్యర్థి కులం కల్గిన వాడు కాబట్టి ఏదైనా మతలబు చేసి వుంటాడని అనుమానం.

ఆ అనుమానమే డిఎస్‌పి లక్ష్మిరెడ్డి, టౌన్ సర్కిలిన్స్‌పెక్టర్ వీరారెడ్డిల బదలీకి కారణమైంది. ఆర్‌డిఒ జనార్దన రెడ్డి, టౌన్ మునిసిపల్ ఇంజనీరు రామసుబ్బా రెడ్డిల బదలీకి కూడా ప్రయత్నించి నట్లున్నారు కాని, అది ఇంకా వీలు పడినట్లు లేదు.

ఏమిటీ దుర్మార్గం? [illegible] వారిని ఎంపిక చేసి, వారా [illegible] వారైనందుకు శిక్షగా, ఆ కులంలో పుట్టడమే నేరంగా పరిగణించే దుస్సాంప్రదాయం, దుష్ట ఆలోచనలు

### డోలేంద్ర

ప్రభుత్వంలో వుండే వారికి ఎందుకు కలుగుతున్నాయి? అధికారం ఎవరి చేతిలో వుంటే, వారి కులం వారే అధికారులుగా వుండాలా? ఇతర కులాల వారు అధికారులుగా వుండడానికి అనర్హులా? అధికారులది ఇతర కులమైతే ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తారా? తమ విధి నిర్వహణ బాధ్యతను, చట్ట పరమైన నియమావళిని ప్రక్కన బెట్టి వ్యవహరిస్తారా? ఎంత మూర్ఖంగా, అనాగరికంగా, అప్రజాస్వామికంగా ఆలోచిస్తున్నారు; అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నారు ప్రభుత్వ నేతలు.

కులాభిమానం వుండవచ్చు; కాని కుల ద్వేషం ప్రమాదకరం. అది సామాజిక జీవనాన్ని కలుషితం చేస్తుంది! అధికారంలో వుండే వారే కుల పరంగా ఆలోచించి, కుల పరంగా నిర్ణయాలు తీసుకొంటే సాంఘికంగా తలెత్తే దుష్పరిణామాలను వూహించగలమా? ఇంత సంకుచిత దృక్పథం కల్గిన వారు సమ దృష్టితో పరిపాలన

(కొరవ 8 పేజీలో)

# వేదాల్లో ఉన్నత ప్రమాణాలకు రామతత్వం అద్దం పట్టింది!

వర్థమాన సమాజం 21, 22 తేదుల్లో టౌన్‌హాల్‌లో ఈ సారి నిర్వహించిన రామాయణ ప్రశస్తి సభల్లో ప్రత్యేకత కొట్టొచ్చినట్లు కనపడింది. మత మౌఢ్యుల కళ్లు తెరిపించే విధంగా ఇద్దరు ముస్లింలు వేదిక నలంకరించారు. హాజీ మహమ్మద్ హైదర్ అధ్యక్షత వహించిన సభలో గుంటూరు కాలేజి లెక్చరర్ మేజర్ షేక్ మౌలాలి మాట్లాడారు. సంస్కృత సాహితీ ప్రపంచంలో ఆది కవి వాల్మీకి - వ్యాస కాళిదాస భవభూతులకు మధుమయ కావ్య జగత్తుకు మార్గ దర్శకునిగా నిలిచాడు. వేదాలలోని వున్నత ప్రమాణాలకు అద్దం పట్టిందన్నారు. ఆదర్శనీయులైన కావ్య నాయకులుగా దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ మానవుల మధ్య అవతరించిన శ్రీ మన్నారాయణుడు లీలా వినోదాలతో చిరకాలం ప్రజల మనో ఫలకాల పై ముద్ర వేసినట్లు చెప్పారాయన. రామచంద్రుడు బంధువులకు, ఆశ్రితులకు, భక్తులకు, సేవకులకు, పశుపక్ష్యాదులకు ఆనంద ప్రదాతయై జగమంతా రామమయం అని శ్లాఘింప బడినట్లు చెప్పారు. అందువల్లే రామాటవత్ వర్తి తవ్యంన రావణా దివత్ అనే వుపదేశం సార్థక మయ్యిందన్నారు.

రెండవ రోజు కె.ఎస్. రామానుజా చార్యుల అధ్యక్షతన జరిగిన సభలో తిమ్మ సముద్రం ఓరియెంటెడ్ కళాశాల ప్రిన్సిపాల్ సూరం శ్రీనివాసులు కాళిదాస రచనలు జీవిత పరమార్థం పై మాట్లాడారు. ధర్మ నిరతి ఒక్కటె ప్రజలకు సుఖశాంతుల నందించ గలదన్నారు. ప్రతి మానవుడు సమాజం నుండి కొంత సహాయాన్ని సుఖ సంతోషాలను కోరుకుంటాడే తప్ప తిరిగి తాను సమాజ శ్రేయస్సుకు సహకరించక, అర్థ కామాల ఆర్జనలో పడి నీతి ధర్మాలను తనకు

### నెల్లూరు సంగతులు

అనుకూలంగా మలచుకొని భాష్యాలు భేషజాలు పలుకు తున్నట్లు చెప్పారు. సభాపోషకులు ఛార్టెడ్ అకౌంటెంట్ దుగ్గొట్టి రమణయ్య సభకు పరిచయం చేసి దుశ్శాలువతో సన్మానించారు. సభారంభంలో ప్రభుత్వ సంగీత కళాశాల విద్యార్థినులు భాగ్యలక్ష్మి, శ్రీలత, చాముండేశ్వరి, సుబ్బలక్ష్మి, మారుతీదేవి, మధుర గీతా లాపన చేసారు. వర్థమాన సమాజ కార్యదర్శి టి.వి. నరసింహం వందన సమర్పణ చేశారు.

### మంచినీటి సమస్య పరిష్కారానికి 6 కోట్లు!

జిల్లాలో మంచి నీటి సమస్య పరిష్కారానికి ఆరు కోట్ల రూపాయలు వ్యయమయ్యే ప్రతిపాదనలు తయారు చేసి ప్రభుత్వానికి పంపినట్లు జిల్లా కలెక్టర్ ప్రేమ్‌చంద్ చెప్పారు. తాగునీటి సమస్య పై 23 తేది జిల్లా పరిషత్ కార్యాలయంలో ఏర్పాటు చేసిన సమావేశంలో మాట్లాడుతూ జిల్లాలో హరిజన, గిరిజన కాలనీల్లో 136 మంచి నీటి పథకాల విస్తరణకు 159.75 లక్షలు, 495 బోర్లు వేయడానికి 87.95 లక్షలు, 40 రక్షిత నీటి పథకాల మరమ్మత్తులకు 25.45 లక్షలు, సమస్యాత్మక గ్రామాలుగా గుర్తించి 33 గ్రామాలకు తాగు నీటిని ట్యాంకర్ల ద్వారా సరఫరా చేయడానికి 10 లక్షలు కేటాయించాలని ప్రతిపాదించినట్లు చెప్పారు. జిల్లాలో మంచి నీటి సమస్య పరిష్కారానికి ప్రభుత్వం నిధులు మంజూరు చేసినందున సంబంధిత అధికారులు అవసరమైన చర్యలు తీసుకోవాలని కోరారు. సమావేశంలో సర్వేపల్లి, ఆత్మకూరు,

(కొరవ 11 పేజీలో)

# రెండేళ్లు ఎదురు చూసేకంటే ఒకసారి పంట వేయడం ఉత్తమం!

రొయ్యల వైరస్ భారత దేశంలోకి ఎటూరానే వచ్చింది. దాన్ని ఎవరు తెచ్చారు? ఎవరు నేరస్తులు? అన్న వివాదం అవసరమే అయినప్పటికీ, దాన్నే వాదించుకుంటూ కూర్చుంటే మనకు పొట్ట నిండదు; దాన్నుంచి ఎట్లా బయట పడాలన్నది ఆలోచించు కోవడమే విజ్ఞత. ఈ విషయంలో ప్రధానంగా మూడు పద్ధతులు గోచరిస్తున్నాయి. వివిధ దేశాల శాస్త్రజ్ఞులు వీటిని సూచిస్తున్నారు. అయితే ఇక్కడ మనం ఒక విషయం ప్రధానంగా గుర్తుంచుకోవాలి. ఈ వైరస్‌కు సంబంధించికాని, దాని ఉనికి గురించి కాని, దాన్నుంచి బయటపడే విషయంలో కాని ఏ దేశంలోని ఏ ఇద్దరు శాస్త్రవేత్తలకు కూడా ఏకూడా ఏకాభిప్రాయం కుదరడంలేదు. అందువల్ల అందరు చెప్పేది విని, వాటిలో మనకేది మంచిదని తోస్తే, దాన్ని పాటించడం అవసరం.

శాస్త్రవేత్తలు సూచించే మూడు విధానాలు-

### ఒకటి క్రాప్ హాలిడే;

రెండు రిజర్వాయర్, క్లోరిన్ ట్రీట్‌మెంట్, మూడు ఏది లేకుండా సరైన సీడ్, మేత యాజమాన్య పద్ధతులు పాటించి సాగు చేయడం.

### క్రాప్ హాలిడే

క్రాప్ హాలిడేకు సంబంధించి, కొందరు ఆరు నెలలు, కొందరు ఒక పంట కాలం, కొందరు రెండేళ్లు అంటున్నారు. ఈ వైరస్ మొదట కన్పించింది-1994 సెప్టెంబరు

> వ్యాధుల నివారణలో ఏ ఇద్దరు శాస్త్ర వేత్తలకు ఏకాభి ప్రాయం లేదు! రొయ్య పిల్లలు, మేత, నీటి యాజ మాన్యంలో జాగ్రత్త పడితే ఒక పంట ఛాన్స్ తీసుకోవచ్చు!

అక్టోబరు నెలల్లో! అంటే ఇప్పటికి ఆరు నెలల కాలం గడిచి పోయిందన్న మాట. కానీ సమస్య పరిష్కారం కాలేదు. ఇప్పటికి పలు చెరువులలో వ్యాధి సోకి, రొయ్యలు మరణిస్తూనే వున్నాయి. శాస్త్రవేత్తల సలహా పాటించి అందరు రైతులు క్రమ శిక్షణతో ఆరు నెలల కాలం వేచి వుండి వుంటె ఎట్లా వుండేదో చెప్పలేము. కాని అది జరగలేదు. ఆరు నెలల సమయం గడిచి పోయింది; సమస్య మాత్రం అట్నే వుంది. అందువల్ల ఆ పద్ధతుల గురించి మాట్లాడడం అనవసరం.

రెండేళ్లు ఎదురు చూసే ఓపిక, ఆర్థిక స్తోమత ఏ రైతుకూ లేదు. కంపెనీలు కూడా భరించలేవు. వడ్డీలు పెరిగిపోతాయి ; ఉత్సాహం చచ్చిపోతుంది. హేచరీలు, ఫీడుమిల్లుల వంటి అనుబంధ పరిశ్రమలు మూత పడిపోతాయి. తిరిగి వాటిని పునరుద్ధరించడం కష్టం. సాంకేతిక నిపుణులు, ముడి పదార్థాలు లభించవు. వాటి నన్నింటినీ మళ్లీ సేకరించడం చాలా శ్రమతో కూడిన పని. యంత్ర పరికరాలను అంతకాలం చెడకుండా కాపాడుకోవాలి. ఒక రకంగా ఆలోచిస్తే రెండేళ్లు వేచి వుండడమంటే, ఆ పరిశ్రమను, ఆ వ్యాపకాన్ని దాదాపుగా వదిలేయడమే అవుతుంది.

అంత తీవ్ర నిర్ణయానికి వచ్చేముందు, ఒక సారి పంట వేసి చూడడం రైతుకు అన్ని విధాలా శ్రేయస్కరం. నష్టం వస్తుంది కదా అంటే రావచ్చు; కాని నష్టానికి సిద్ధపడైనా సరె ఒక ఛాన్సు తీసుకోవడం

(కరప 7 పేజీలో)

పొన్నలూరు కోటా రెడ్డి మెమోరియల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో ఈ నెల 23 తేది గూడూరులో జరిగిన స్మారక సభలో డా. మంగళంపల్లి బాలమురళీకృష్ణను సన్మానిస్తున్న బెజవాడ గోపాలురెడ్డి, కోటారెడ్డి కుమారుడు సనత్ కుమార్ రెడ్డి

# మురికి కాలువ నిర్మాణ లోపం- మంచి నీటి బావికి శాపం!

ఎండలు ముదరడంతో కావలి ప్రజలు నీటికై కటకట లాడుతున్నారు. వున్న బావుల్లో అంతంత మాత్రంగానే వున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో రైల్వే అధికారుల నిర్లక్ష్యానికి నిదర్శనంగా ఓ మంచి నీటి బావి మురికి నీరుతో నిండిపోయి పనికి రాకుండా పోయింది. ఉదయగిరి రోడ్డులో కొత్తగా నిర్మించిన రైల్వే ఓవర్ బ్రిడ్జి మీద మురికి నీటిని మళ్లించేందుకు 8 లక్షల వ్యయంతో కాల్వ నిర్మించారు. ఈ కాల్వ పను లను అంతంత మాత్రం చేయడంతో ఆ మురికి నీరంతా బ్రిడ్జికి దిగువ ప్రాంతంలో వున్న మంచి నీటి బావిలోకి వెళ్లి పోతున్నాయి... పందలాది కుటుంబాలకు నీరు కలుషిత మవడం వల్ల బావిని వినియోగించడం మానేశారు. మురికి నీరు ప్రవేశిస్తున్న విషయాన్ని మునిసిపాలిటీ దృష్టికి తీసుకెళ్లగా తమ

## జిల్లావార్తలు

పరిధిలోనిది కాదని రైల్వే శాఖను సంప్రదించమని సలహా యిచ్చారట. స్థానిక రైల్వే అధికారులు ఈ విషయం తెలుపగా తమ శాఖ వున్నతాధికారులు పట్టించుకొని పరిష్కరించాలి తప్ప

కరప 7 పేజీలో

# నెల్లూరు గుసగుసలు

**విలేఖరుడు**

## కో ఆప్షన్ సభ్యుల ఎన్నిక జరగలేదు!

నెల్లూరు మునిసిపాలిటీలో కో ఆప్షన్ సభ్యుల ఎన్నిక వాయిదా పడింది. 25 తేదీ జరిగిన మునిసిపల్ సమావేశంలోనే ముగ్గురు సభ్యులను ఎన్నుకోవాల్సింది. ఎన్నికకు సంబంధించిన నిర్దిష్టమైన సూచనలు అడ్మినిస్ట్రేషన్ అర్బన్ డెవలప్‌మెంటు అధికారులు ఇవ్వనందున వాయిదా వేస్తున్నట్లు ఛైర్మన్ వివేకానంద రెడ్డి సమావేశంలోనే ప్రకటించారు. ఈ పదవుల కోసం 18 మంది దరఖాస్తు చేసారు. వీరిలో మాజీ కౌన్సిలర్లే 8 మంది వున్నారు. మునిసిపాలిటీలో వివిధ హోదాల్లో పనిచేసి రిటైర్డ్ అయిన 10 మంది అధికారులు కూడా దరఖాస్తు చేసారు. ఎన్నిక జరిగి వుంటే లేనిపోని రభసలో వివేకా చిక్కుకొనే వారు. కాని తెలివిగా తప్పించుకొన్నారు.

## నెల్లూరు ఆర్డీఓ బదలీ

గత గురువారం మునిసిపల్ కమిషనర్ కెప్టెన్ డివి రెడ్డి బదలీ అయ్యారు. ఈ వారం నెల్లూరు ఆర్డీఓ జనార్ధన రెడ్డి వంతు వచ్చింది. ఇంకా ఎక్కడా ఆయనకు పోస్టింగు ఇచ్చినట్లు లేదు. కొత్త ఆర్డీఓగా హైదరాబాద్ నుంచి శ్రీదేవిని నియమించారు. మునిసిపల్ ఎన్నికల తర్వాత నెల్లూరులో పని చేస్తున్న అధికారుల్లో బదలీ అయిన వారిలో జనార్ధన రెడ్డి మూడోవాడు. రాజకీయ బదలీ 'కత్తి' వేటు నుంచి మునిసిపల్ ఇంజనీరు రామసుబ్బా రెడ్డి ప్రస్తుతం ఒక్కడే మిగిలి వున్నాడు. బహూశా ఆయనకూ బదలీ తప్పదేమో! బదలీలపై బదలీ చేయిస్తున్న తెలుగు తమ్ముళ్లను ప్రజలు ఎంత ఈసడించి కొంటున్నారో అర్థం చేసుకోకుంటె ఈ పనులకు పాల్పడరు.

## కొత్త ఎక్సైజ్ ఎస్‌పి

జిల్లా ప్రొహిబిషన్, ఎక్సైజ్ సూపరింటెండెంట్‌గా పి. సంజీవ ప్రసాద్ బాధ్యతలు స్వీకరించారు. గతంలో నెల్లూరు డిపో మేనేజరుగా వుండేవారు. ఇక్కడ పనిచేస్తున్న ఎస్‌పి దివాకర్‌ను పదోన్నతి కల్పించి నెల్లూరులో నే నియమించేటట్లున్నారు.

## తిక్కవరపు రామరెడ్డి జయంతి!

తిక్కవరపు రామరెడ్డి 104 జయంతి మహోత్సవం 30 తేదీ ఆదివారం టౌన్‌హాల్‌లో జరుగుతుంది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి విశ్వనాథ సత్యనారాయణ గూర్చి, స్వయంపాకుల శ్రీనివాసులు, గుర్రం జాషువా ఖండ కావ్యాలు, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, దువ్వూరి రామిరెడ్డి రచనల గూర్చి మాట్లాడుతారు. సభలో స్వర్గీయ శ్రీమతి లక్ష్మీకాంతమ్మ స్మృత్యంకంగా వొసగే సన్మానాన్ని శ్రీమతి నవరత్నం వీరాస్వామి స్వీకరిస్తారని సాహిత్య సదస్సు కార్యదర్శి గోసుకొండ వెంకట సుబ్బయ్య తెలియజేస్తున్నారు.

## జడ్పీలో కాంగ్రెస్ విప్ శివరామకృష్ణారెడ్డి

జిల్లా పరిషత్‌లో కాంగ్రెస్ పార్టీ విప్‌గా బుచ్చిరెడ్డి పాళెం టిసి సభ్యుడు ఏలూరు శివరామ కృష్ణారెడ్డిని నియమించారు. జడ్పీలో కాంగ్రెస్ పార్టీ నాయకుడు, ఉపనాయకుని ఎన్నికకు విప్ సన్నాహాక సమావేశం పెడతారు.

## సబ్ జడ్జిల నియామకం

కావలి, గూడూరు, కోవూరు సబార్డినేట్ జడ్జి కోర్టులకు కొత్త న్యాయమూర్తులు నియమింప బడ్డారు. కావలికి నిజామాబాద్ నుంచి జి. శ్యామ్ ప్రసాద్‌ను, గూడూరుకు రంగారెడ్డి జిల్లా నుంచి సి.ఎస్.డి. విజయకుమార్, కోవూరుకు తిరుపతి నుంచి టి. రామరాజు వచ్చారు. వీరందరూ నెల్లూరు సబార్డినేట్ జడ్జి మహమ్మద్ గౌస్ షరీఫ్ బాషా నుంచి బాధ్యతలు స్వీకరించారి.

## బార్ అసోసియేషన్ వార్షికోత్సవం!

పట్టణ న్యాయ వాదుల సంఘం వార్షికోత్సవం 29 తేదీ వి.ఆర్.సి. గ్రౌండ్‌లో జరుగుతుంది. హై కోర్ట్ న్యాయమూర్తి డి. రెడ్డప్పరెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొంటారు. అసోసియేషన్ అధ్యక్షులు పి.వి. రమణారెడ్డి అధ్యక్షత వహిస్తారు.

## సడ్‌సన్ హౌసింగ్ షేర్ల జారీ!

మద్రాసులో పేరెన్నికగన్న గల ప్రముఖ పారిశ్రామిక వేత్త, హోటల్ తాజ్ కోరమండల్ ఎం.డినెల్లూరీయుడు డి. సుధాకర రెడ్డి కొత్త వ్యాపారంలోకి అడుగు పెట్టుతున్నారు. హౌసింగ్ డెవలప్‌మెంట్ ఇండియా పేరుతో మద్రాసు అన్నానగర్ 18.32కోట్ల వ్యయంతో అపార్ట్‌మెంట్స్ కట్టబోతున్నారు. దీని కోసం సంస్థ 10 రూపాయల షేర్ విలువతో 9 లక్షల పబ్లిక్ ఇష్యూలను మే 3 తేదీ విడుదల చేస్తుంది. పలు వ్యాపారాల్లో తిరుగు లేదనిపించుకొన్న సుధాకర రెడ్డి ఈ రంగంలోను నిలదొక్కు కొంటారన్నదానిలో సందేహం లేదు. ఇన్వెస్టరదే ఆలస్యం!

## పాపను ఎవరు, ఎందుకుతగులబెట్టారు?

స్టోన్‌హౌస్‌పేట రేబాల వారి సందులో బుధవారం వుదయం జరిగిన తొమ్మిదేళ్ల బాలిక వనలక్ష్మి సజీవ దహనం వార్త విని ద్రవించిన హృదయ ముండదు. ఈ చిన్నారి పై కిరోసిన్ పోసి తగుల పెట్టిన దుర్మార్గుతెవడో అర్థం కావడం లేదు. పాపే తన మరణ వాంగ్మూలంతో గద్దంతో నల్లగా వున్న వ్యక్తి కిరోసిన్ పోసి నిప్పంటించి గోడ దూకి పరారైనట్లు చెప్పింది. బాలిక తల్లి రమణమ్మ తెలుగు యువత నాయకుడు రంగరాజన్ ఇంటిలో పనిమనిషి. ఆ ఇంటి వెనుక వున్న రూంలోనే కాపురం వుంటున్నారు. వనలక్ష్మి ఏదైనా సంఘటన చూసిందా; దాన్ని బయటకు చెబుతుందని ఎవరైనా ఈ దారుణానికి పాల్పడ్డారా అనే విషయాలు పోలీసు లోతుగా దర్యాప్తు చేస్తె గాని వెల్లడి కావు. అపామాషీగా సినిమాలు చూసి పాపనే ఈ పనికి పాల్పడి వుండవచ్చని పోలీసులు చెప్పడం వారి పని తీరును శంకించ వలసి వస్తుంది. ఈ సంవత్సరం మొదటి నుండి ఇప్పటి వరకు 11 మంది మైనర్ బాలికలు వివిధ సంఘటనల్లో ప్రాణాలు కోల్పోయారు. వీటికి కారణభూతులైన ఒక్కడినైన అరెస్టు చేసి పోలీస్ తమ చిత్తశుద్ధి ప్రదర్శించ లేదు.

## మరణాలు

నెల్లూరు వైశ్య ప్రముఖుడు, సర్వోదయ కాలేజి ఉన్నతికి కారకుడు, సిసి సుబ్బరాయుడు గారి కుమారుడు, ఇంజనీరు, సుబ్బరాయుడు గారి వ్యాపార బాధ్యతలను చూస్తున్న సుబ్బు కృష్ణమూర్తి చిన్న వయస్సులోనే 14.4.95 తేది అకాల మరణం పాలయ్యాడు. సుబ్బరాయుడి గారికి ఈ వయస్సులో చేతికంది వచ్చిన కుమారుడి మరణం వర్ణించలేనిది. సుబ్బరాయుడు గారికి మా సానుభూతి.

* * *

అందంగా, చూడ ముచ్చటగా, అందరిని ఆకట్టుకునేట్లు ఇళ్ళు నిర్మాణం చేసే ఇంజనీరు బి. మోహన్ రెడ్డి, డా. ప్రభాకర రెడ్డి గారి తండ్రి బోగొల్లు నారాయణ రెడ్డి 82వ ఏట మరణించారు. వారికి ముగురు కుమారులు.

## ఉత్తరక్రియలు

మా ఆరాధ్య దైవం, మా అభివృద్ధి కారకులు

**బోగొల్లునారాయణరెడ్డిగారు**

పాటూరు

23.4.95 తేది స్వర్గస్తులైనారు వారికి దైవ సన్నిధిలో చిరశాంతి కలుగాలని ప్రార్థిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**3.5.95 తేది బుధవారం పెద్దకర్మ**

నెల్లూరు దర్గామిట్ట రెవెన్యూ కాలనీ, వెంకటరమణ క్లినిక్ మా స్వగృహంలో జరుపబడును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

భార్య: పిచ్చమ్మ
తమ్ముడు: బోగోలు చంద్రారెడ్డి
కుమారులు-కోడళ్లు: బి. వేణుగోపాల్ రెడ్డి - రేవతి
డా. బి. ప్రభాకర రెడ్డి - సరోజిని
ఇంజనీర్ బి. మోహనరెడ్డి, నిర్మల
మనుమలు - మనుమరాండ్రు: అనూజ, వంశి, సతీష్ సత్యనాథ్ ఉద్దీప్, సందీప్

## రొయ్యలు

5 పేజీ తరువాయి

మెలన్పిస్తున్నది. గట్టిక్కితే అదృష్టం. లేకుంటే ఆ పీత అక్కడితో విరగడై పోతుంది.

ధామ్సు తీసుకుని సాగు చేసేటప్పుడు చాలా జాగ్రత్తలు పాటించడం అవసరం. ఎంతో పెట్టుబడి ఇమిడి వుండే ఈ వ్యాపకంలో చిన్న పొరపాటు సైతం పెద్ద రిస్క్‌గా పరిణమించ వచ్చు.

రొయ్య పిల్లలు ఎంపిక, మేత రకం, మేత వాడేవిధానం, నీటి యాజమాన్యం: నాణ్యత, వలలు వంటి పరికరాలు, పక్షుల నుంచి రక్షణ తదితర విషయాలన్నింటిలోనూ ఈ జాగ్రత్త వుండాలి.

### రొయ్య పిల్లలు

ఈ వైరస్ ప్రధానంగా రొయ్య పిల్లల ద్వారా వ్యాపిస్తుందని ఒక అభిప్రాయం. అందువల్ల హేచరీల నుంచి ఎంపిక చేసుకునే పిఎల్ సైజు పిల్లల విషయంలో చాలా జాగ్రత్తలు పాటించాలి. పలు హేచరీలు అధిక ఉత్పత్తి కోసం అక్రమ పద్ధతులు పాటిస్తుంటాయి. ట్యాంకులలో నీటి ఉష్ణోగ్రత పెంచి హేచింగ్ శాతాన్ని అధికం చేసుకోవడం; ఇంకొక ప్రక్క రకరకాల మందులు గుప్పించి, వాటిని బ్రతికించడం, చిన్నసైజు పిల్లలను అమ్మివేయడం వంటి అక్రమాలకు పాల్పడుతుంటారు. ఇక్కడ రైతులు ప్రధానంగా గమనించ వలసింది- పిఎల్ సైజుకు వచ్చిన తర్వాత వాటిని ఆరు బయలు ట్యాంకులకు మారుస్తున్నారా లేదా; ఒక్కొక్క ట్యాంకులో లేదా లీటరుకు ఎన్ని పిల్లలు వుంచారు; అవి ఆరోగ్యంగా వున్నాయా లేదా అన్నది.

షెడ్‌ల లోపల ట్యాంకులలోనే పిఎల్ 20 వరకు పెంచి, అమ్మితే వాటిని కొనడం అనవసరం. సాధారణంగా అవి ఏ రకమైన ఒత్తిడినీ తట్టుకోలేవు. ఆరు బయలు ట్యాంకులలో వుంచినవి- కనీసం పదిరోజుల పాటు వుంచితే- అవి మనవాతావరణ పరిస్థితులకు అలవాటు పడిపోతాయి. చెరువులలో సులభంగా బ్రతుకుతాయి.

ట్యాంకులలో లీటరు నీటికి 25నుండి 30 లెక్కన రొయ్య పిల్లలు పెంచితే మంచిది. కాని కొన్ని హేచరీలు కక్కుర్తికి పాల్పడి 200 వరకు పెంచుతాయి. అంత రద్దీ పరిస్థితులలో వాటిని బ్రతికించడానికి తప్పని సరిగా మందులు వాడి తీరాలి. ఆ పనివయస్సులో యాంటీబయాటిక్‌లు మాత్రమే తిని బ్రతికిన పిల్లలలో రోగ నిరోధక శక్తి వుండదు. చెరువులలో సులభంగా రోగాల పాలౌతాయి. వాటికి ఏ మందులూ పనిచేయవు.

పిల్లల ఆరోగ్యం పరీక్షించడానికి ఒక సులభమైన పద్ధతి వుంది. ఒక చిన్న బక్కెట్ లేదా టబ్‌లో వంద పిల్లలు లెక్కపెట్టి, ఉప్పుశాతాన్ని 10నుంచి 20 పిపిటి వరకు ఒకే సారి తగ్గించి రెండుగంటలపాటు పరీక్షించడం. అవి ఆ ఉప్పుశాతం మార్పును తట్టుకొని కనీసం 85 శాతం బ్రతికితే ఆరోగ్యంగా వున్నట్లు. 70-75 కంటె సర్వైవల్ తగ్గితే వాటిని కొనకూడదు.

ఫార్మలిన్ రసాయనం 100 పిపిఎం కలిపిన నీళ్ళలోనూ ఆదేమాదిరి పరీక్ష చేయాలి. అక్కడ అవి 80 శాతం కంటె ఎక్కువ బ్రతికి తీరాలి. ఏ హేచరీలోనైనా రొయ్య పిల్లలు కొనేముందు ఈ పరీక్ష చేసి తీరాలని పట్టుపట్ట వచ్చు.

రొయ్య పిల్లలు ఆరోగ్యంగా వుంటె బాక్టీరియా, ఫంగస్, ప్యారసైట్, ప్రోటోజోవావంటి జబ్బులను తట్టుకుంటాయి. ఆ రకం జబ్బులు నిరోధించ గల్గితే, వైరస్‌ను కూడా సాధ్యమైనంత ఎక్కువ కాలం దూరంగా నిలువరించవచ్చు. ఆరోగ్యకర వాతావరణంతో వైరస్ సోకే అవకాశాలు తక్కువ.

### మేత

పిల్లల తర్వాత రైతులు జాగ్రత్త పడవలసిన అత్యంత ప్రధాన విషయం -మేత. మేత ద్వారా కూడా వైరస్ సోకే అవకాశం వుందని కొందరు శాస్త్రవేత్తలు అనుమానిస్తున్నప్పుడు ఆ విషయంలో తగు జాగ్రత్తలు తీసుకోవడం తప్పదు.

త్వరితంగా పెరుగుదల చూపించడానికి చాలా కంపెనీలు, ముఖ్యంగా తైవాన్, థాయిలాండ్ కంపెనీలు యాంటీ బయాటిక్స్, స్టెరాయిడ్స్ వంటివి వాడుతుంటాయి. అటువంటి అనుమానం కల్గిన కంపెనీలను దూరంగా వుంచాలి. రొయ్య తలకాయలు వాడే మేత జోలికి పోవద్దు. శాస్త్రీయ ఆధారం లేక పోయినప్పటికీ, రొయ్య తలకాయల ద్వారా వైరస్ వచ్చే అవకాశం వుందన్న వాదం ఒకటి వుంది కాబట్టి ఎందుకు రిస్క్ తీసుకోవడం?

రెండు మూడు నెలలకు పైబడిన మేతను వాడడం ప్రమాదకరం. నిల్వ వుంచిన మేతలు వాడరాదు. ఫ్రెష్‌గా తయారయ్యే మేతలు ఎంచుకోవడం ఉత్తమం. అసలే రిస్క్ పరిస్థితులలో వున్నప్పుడు అధిక ధరలు పెట్టి విదేశీ మేతలు వాడే కంటె, ధర తక్కువలో నాణ్యత పాటించే స్వదేశీ కంపెనీలను ఎంచుకోవడం శ్రేయస్కరం.

మేత వాడే పద్ధతుల్లోనూ మార్పులు రావాలి. చెక్‌ట్రేలు ఖచ్చితమైన కొలతలలో చేయించి, పాండ్‌కు నాలుగు ప్రక్కలా అమర్చి- లెక్కప్రకారం మేతను కొద్ది కొద్ది పరిమాణంలో వేయాలి. రోజుకు పది, పన్నెండు సార్లుగా, అంటే రెండు మూడు గంటల కొకసారి మేత వేసినా మంచిదే. దీనివల్ల చెరువులో, నీటి కాలుష్యం ఏర్పడకుండా కాపాడు కోవచ్చు;

చెక్‌ట్రేలు పదే పదే పరీక్షించి మేత ఇవ్వడం వల్ల మేత ఖర్చు తగ్గించుకోవచ్చు. చెక్‌ట్రేలో కన్పించే ప్రకారం రొయ్యలు పూర్తిగా తింటున్నాయని ధృవ పడిన తర్వాతే, మేత ఇవ్వాలి.

### నీటి యాజమాన్యం

ఆరు నెలల క్రితం వరకు రొయల చెరువుల్లో కనీసం రోజుకు 20 నుంచి 30 శాతం నీటి మార్పిడి చేయడం శ్రేయస్కరమని చెప్పేవారు. ఇప్పుడు ఎంత తక్కువ నీటి మార్పిడితో చెరువును కాపాడుకోగల్గితే, అంత మంచిది అంటున్నారు.

కాలువలు, సముద్రజలాలలో వైరస్ క్రిములు వుండే అవకాశం వుం. కాబట్టి నీళ్ళు తరచు మార్చి ఆ వ్యాధి కొని తెచ్చుకొనే కంటె, ఆ నీటి జోలికే పోకుండా వుండడం ఉత్తమం.

ఒక శాస్త్రవేత్త సూచన ఏమిటంటే - మొదటి సారి చెరువు నిండా నీరు తోడి, క్లోరిన్‌తో శుద్ధిచేసి, వారం వ్యవధి తర్వాత పిల్లలు స్టాక్ చేయడం; అప్పటినుంచి పంట పూర్తికాలం కాలువ లేదా సముద్ర జలాల జోలికి పోకుండా ఫిల్టర్ పాయింట్ నీటిపై ఆధార పడడం ద్వారా వైరస్ ప్రమాదాన్ని నివారించ వచ్చునంటున్నారు. ఇది పరిశీలించదగిన విషయమే.

నీటి మార్పిడిని ఎంత తగ్గిస్తె అంత మేలు. నీళ్ళు మార్చేటప్పుడు, ఆ నీటి ద్వారా చెరువుకు, కాలువల్లోని నీటికి సంబంధం ఏర్పడుతుంది. కాలువలో వైరస్ వుంటే వెంటనే తూము ద్వారా చెరువులోకి ప్రవేశిస్తుంది. అందువల్ల నీటి మార్పిడిని నివారించి, ఎరియేటర్ల ద్వారా ఆక్సిజన్ పరిమాణాన్ని కాపాడుకోవాలి. నీరు చెడిపోకుండా వుంచడానికి పేడ, రసాయనిక ఎరువులు వాడకుండడంతోపాటు, మేత వృధా కాకుండా చూడాలి. ఫైటో ప్లాంక్టన్ మీద ఆధారపడడం కోసం ఎరువులు వేసి, చేటు కొని తెచ్చుకోవడం అనవసరం.

వ్యాధుల సమస్య, ఇతర విషయాల గురించి పైవారం చర్చించుకుందాం! *

## జిల్లావార్తలు

5 పేజీ తరువాయి

తామెమి చేయలే మంటున్నారు. నీటికై ప్రజల ఇబ్బంది తెలుసుకొని ఎవరో ఒకరు కల్పించుకొని కాల్వ లీకేజిని అరికట్టి మంచి నీటి వనరులను కాపాడ వలసిన అవసరం ఎంతైనా వుంది.

### కార్ల దొంగలు పట్టుబడ్డారు!

గూడూరు: నాయుడుపేట, సూళ్ళూరు పేట, కాళహస్తి ప్రాంతాల్లో జరిగిన కార్ల దొంగ తనాలకు బాధ్యులైన ముఠాను గూడూరు పోలీసులు చాకచక్యంగా పట్టుకొన్నారు. మద్రాస్‌కు చెందిన కుమార్, కన్నన్ కార్లను దొంగతనం చేయడంలో సిద్ధహస్తులు. 94 సెప్టెంబరులో సూళ్ళూరుపేట రైల్వే క్వార్టర్స్ వద్ద నిలిపి వున్న టి.ఎం.జె. 4561 కారుకు సైడ్ గ్లాసులు తొలగించి తీసుకెళ్ళి పోయారు. డిశంబర్‌లో సూళ్ళూరుపేట, 95 జనవరి నెలలో నాయుడుపేట, మార్చి నెలలో గూడూరుల్లో ఇటువంటి దొంగ తనాలకు పాల్పడ్డారు. ఏప్రెల్ 21 తేది గూడూరుకు చెందిన మదార్ సాహెబ్ కారు కూడా ఇదే విధంగా దొంగలించి సాయిబాబా మందిరం వద్ద చాటుగా నిలిపి వచ్చిన కన్నన్, మరో కారును గాలం వేయను కర్నాల వీధిలో ప్రయత్నిస్తుండారు. అదే సమయంలో గస్తీ తిరుగుతుండిన కానిస్టేబిల్ క్రాంతి కుమార్, హోంగార్డు వేణులు అనుమానంతో అతన్ని ప్రశ్నించగా తడబడి సమాధానం చెప్పడంతో స్టేషన్‌కు తీసుకొచ్చారు. అక్కడ తీగ లాగితే డొంకంతా కదిలింది. వీరిద్దరు ఇంతకు ముందు కార్లలోని టేప్ రికార్డులు దొంగలించే వారట. ఒక కేసులో మద్రాస్ జైలు కెళ్లి అక్కడున్న కార్ల దొంగ సాయికుమార్ ద్వారా 'టెక్నిక్స్' నేర్చుకొని రూటు మార్చుకొన్నారట. వీరు దొంగలించిన కార్లను కుంభకోణం, ఆంధ్రుత్తూరు లలో అమ్మినట్లు చెప్పగా వాటిని పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. కేసును డి.ఎస్.పి. ఎ. రాఘ ఆధ్వర్యంలో, ఇన్స్‌పెక్టర్లు వెంకట రామిరెడ్డి, నాయుడుపేట ఎస్‌ఐ దేవకుమార్ ప్రతిభా వంతంగా విచారించి కార్ల దొంగల ఆట కట్టించారు.


**జమీన్‌రైతు**

సంవత్సరచందా రూ. 100/-

అర్ధసంవత్సర చందా రూ.50/-

విడిప్రతిరూ. 2/-




నెల్లూరు మున్సిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డికి ఎసినగర్‌లో అభినందన సభ ఏర్పాటు చేసి వుపాహార విందులో సత్కరించిన టౌన్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి పందిళ్లపల్లి అరుణమ్మ

ఈ నెల 20 తేది ఢిల్లీలో జరిగిన ప్రఖ్యాత జర్నలిస్ట్ జి.కె. రెడ్డి అవార్డ్ ప్రదానోత్సవంలో ప్రధాన మంత్రి పి.వి. నరసింహా రావు గారి నుండి అవార్డును స్వీకరిస్తున్న ఇండియాటుడే సంపాదకుడు అరుణ్‌పూరి, ఆర్థికమంత్రి మన్‌మోహన్ సింగ్, టిక్కవరపు సుబ్బరామరెడ్డి.

# పవన్ సచ్ దేవ

2 పేజీ కొరవ

సెబి అభ్యంతరం తెల్పింది. కన్వర్ట్స్ రేటు అనే విషయం స్పష్టం చేయలేదని నిరసించింది. దాన్ని సరిదిద్దడానికి సచ్‌దేవ సరైన ప్రయత్నం చేయలేదు. కావాలని కాలయాపన చేశాడు.- ఫలితం - సెబి విచారణ ప్రారంభించింది. లోతుకు పోయే కొద్ది చాలా లొసుగులు బయట పడ్డాయి. బొంబాయి స్టాక్ ఎక్స్చేంజిలో మూడు రోజులు అప్పి షేర్ల లావాదేవీలు నిల్చిపోయేంత తీవ్ర పరిస్థితులేర్పడ్డాయి. సచ్‌దేవ షేర్లు అమ్మిన ఒక బ్రోకరు 13 కోట్లు బాకీ పడ్డాడు. పరిస్థితి సచ్‌దేవ చేయిదాటి పోయింది. సెబి అధికారులు, ఇష్యూకు లీడ్ మేనేజర్లుగా వ్యవహరించిన స్టేట్ బ్యాంకు పెద్దలు, ఇతర సంస్థల ఉద్యోగులు సచ్‌దేవతో చేతులు కలిపిన విషయం బయట పడింది. వారందరూ సస్పెండ్ అయినారు. విషయం పార్లమెంట్‌లో చర్చకు వచ్చింది; సిబిఐ రంగంలోకి దిగింది; సచ్‌దేవ అరెస్టయ్యాడు; బెయిల్ కూడా దొరకలేదు; మెర్సిడెజ్ బెంజ్ కార్లలో తిరిగిన వాడు తీహార్ జైలు గదులలో పవళించాల్సి వచ్చింది.

ఇంకొక ప్రక్క ఇష్యూలో పెట్టుబడి పెట్టినవారు తమ డబ్బు వెనక్కు తీసుకొన్నారు. గ్యారంటీ అన్న నమ్మకంతో ఇష్యూ పూర్తయిందని ప్రకటించడంతో అండర్ రైటర్లు ముందు చేయి చూపించారు. మిగిలిన సొమ్ము వాపసు చేయమని సెబి ఆదేశించింది. మొత్తం గోవింద కొట్టింది.

700 కోట్లకు అధిపతి కాబోయిన సచ్‌దేవ వారం తిరిగే సరికల్లా బికారి అయిపోయాడు. బెంగుళూరులో సాధించిన హోటల్ స్థలానికి ఏప్రెల్ 30 తేదిలోగా 100 కోట్లు కట్టాలి. అంత డబ్బు అతడి దగ్గర లేదు. అడ్వాన్సుగా కట్టిన 60 కోట్లు కోల్పోవడంతోపాటు, స్థలమూ చేజార్చుకొన్నాడు. పబ్లిక్ ఇష్యూకు పెట్టిన 20 కోట్లు వృధా అయిపోయాయి. బ్యాంకులు ఇచ్చిన 100 కోట్ల బ్రిడ్జి లోన్లు తిరిగి చెల్లించే పరిస్థితి లేదు. వారు వున్న ఆస్తులు వేలం వేస్తారు.

ధీరుభాయి అంబాని ఆదర్శంగా, అంత ఎత్తుకు ఎదగాలనుకున్న సచ్‌దేవ బికారిగా మారిపోయాడు. కారు పెట్రోలుకు డబ్బులేక, పదిలీటర్లకు మించి ఒకే సారి పెట్రోలు పట్టించలేని పరిస్థితి వచ్చేశాడు. అతను మోజు పడి దిగుమతి చేసుకున్న మెర్సిడెజ్ బెంజ్ కారు - కస్టమ్సు సుంకంగా 40 లక్షలు బాకీ పడి, విడుదల కాక రేవులోనే పడి వుంది. ఆశాసౌధాలు కుప్పకూలిపోయాయి.

సచ్‌దేవవలె ఎందరో ఇటువంటి దుర్మార్గులు ఇదివరకు చాలా చేశారు. అతడ్ని అదృష్టం వరించలేదు, అంతే!

ఇటువంటి చరిత్రే రాజన్ పిళ్లెది! ఈయన నాలుగేళ్ల క్రితం రాజన్ పిళ్లెతో పరిచయం వుందని చెప్పుకోవడానికి చాలా మంది పారిశ్రామిక వేత్తలు, రాజకీయ నాయకులు గర్వపడేవారు. ఇప్పుడు పిళ్లె పోలీసులను తప్పించుకొని రహస్య జీవితం గడుపుతున్నాడు; దొంగలాగా బ్రతుకుతున్నాడు. అతడి పతనానికి కారణమూ దురాశే!

రాజన్‌పిళ్లె బ్రిటానియా కంపెనీకి అధినేత. అందులో అతని వాటా తక్కువే కాని, తెలివితో ఆధిపత్యం సంపాదించాడు. చాలా విలాసవంతమైన జీవితం గడిపాడు. అతడి భార్య వైభవం దేశంలోని ఏ పారిశ్రామిక వేత్త సతిమణీ అనుభవించి వుండదు.



పారిశ్రామికవేత్తలు దిగేసి తిరిగేవాడు. నస్లివాడియా వంటి బడా పారిశ్రామిక వేత్తలు పిళ్లె స్నేహితులు.

బొంబాయిలో హర్షద్ మెహతా ఇంటిని అనుకొని ఒక ప్యాలెస్ నిర్మించాడు. సింగపూర్‌లో పెద్ద భవంతి కట్టాడు.

తన కంపెనీ విదేశీ వాటా దారులను మోసంచేశాడన్న నేరంలో సింగపూర్ అతడ్ని దోషిగా ప్రకటించింది. తప్పించుకొని వచ్చి, ఇండియాలో అండర్ గ్రౌండ్ జీవితం కొనసాగిస్తున్నాడు. దురదృష్టవంతుడు.

## యూనిట్ ట్రస్ట్

2 పేజీ కొరవ

ఏప్రెల్ 27 తేది `మంత్లీ ఇన్ కం స్కీం' అంటూ 12 శాతం నెల వడ్డీలతో కొత్త స్కీం రాబోతుంది. ఇది పెన్షనర్స్, వుద్యోగ విరమణ చేసిన వారికి వుద్దేశించి దంటున్నారు. కాని ఈ డబ్బు బ్యాంకులో వేసుకొన్నా ఈ వడ్డీ వస్తుంది. 1996 లో యుటిఐ బ్యాంకు పెట్టి పబ్లిక్ ఇష్యూ రావాలని చూస్తుంది. ఏది ఏమైనా ముందు వెనుకా ఆలోచించి పెట్టుబడి పెట్టడమే ఉత్తమం!

## పబ్లిక్ ఇష్యూల పట్ల పిచ్చి తగ్గడం లేదు!

షేర్ మార్కెట్ సంక్షోభంలో వున్నా పబ్లిక్ ఇష్యూల పట్ల ప్రజల పిచ్చి తగ్గడం లేదు. 1995 జనవరి 147, ఫిబ్రవరి 200, మార్చి 173, ఏప్రెల్ 138, పబ్లిక్ ఇష్యూలు ప్రజల వద్ద డబ్బు వసూలు చేయను వచ్చాయి. ఎం.ఎస్.షూస్ పబ్లిక్ ఇష్యూ గొడవ తరువాత మార్కెట్‌లో మాయాజాలం విశదం కావడంతో షేర్ మార్కెట్ కార్యకలాపాలు కొద్దిగా తగ్గాయి. అయితే మే, జూన్ నెలల్లో 16 బాగా స్థిరపడిన పెద్ద కంపెనీలు ఎక్కువ ప్రీమియంతో 14 వందల కోట్ల రూపాయలు వసూలు చేసేందుకు ప్రజల ముందుకు వస్తున్నాయి. టివి పత్రికా ప్రకటనలు చూసి దరఖాస్తు చేసి వినియోగదారులు నష్టపోతున్నారు. ఈ షేర్లు దరఖాస్తు చేసి ఆ సర్టిఫికెట్లు మన చేతికొచ్చే లోగానే మార్కెట్‌లో ఈ షేర్లు తక్కువ ధరకు లభిస్తున్నాయి. 95 సంవత్సరం 2,900 కంపెనీలు పబ్లిక్ ఇష్యూలతో 53 వేల కోట్ల వసూళ్ల కొరకు గోతి కాడ నక్కల్లా కాచుకొని వున్నాయి. ఇందులో పబ్లిక్ సెక్టారు అండర్ టేకింగ్ వాళ్లు 8 వేల కోట్లు చిన్నా పెద్దా బ్యాంకులు 7500 కోట్లు పెద్ద ప్రీమియంలో రానున్నాయి. ఏది ఏమైనా 96 పార్లమెంట్ ఎన్నికలు జరిగి స్థిరమైన ప్రభుత్వం ఏర్పడే వరకు షేర్లు కొనుగోలు చేయడమే అనవసరం. మంజూరైన సర్టిఫికెట్లు బీరువాల్లో అలంకారంగా పెట్టుకోవడం మినహా డబ్బు చేసుకోవడానికి పనికిరావు.

ఈ రోజు అలాట్‌మెంట్, రిఫండ్ చేయకుండా కంపెనీల వద్ద ప్రజల డబ్బు 10 వేల కోట్లు మూలుగుతోంది. ఇన్ని తెలిసి ఆలోచించ కుండా పబ్లిక్ ఇష్యూలకు డబ్బు కట్టడం ప్రజలు తగించుకుంటే మంచిది!

## సణుగుడు

4 పేజీ కొరవ

సాగించడం అసంభవం. ఈ ప్రాస్య

దృష్టి ఈ ఐరుకు బుద్ధి ఈ దుస్సాంగత్యం, ఈ దుర్మార్గ వ్యవహార శైలి, ఈ అధికార దుర్వినియోగం దీర్ఘ కాలంలో వూహించ లేని చెడు ఫలితాలను సంప్రాప్తింప జేస్తాయి.

ఈ విషయంలో నైటి నాయుడ్ని తప్పు పట్టలేము. ఓడిపోయిన విచారంలో, కొద్దిలో అవకాశం చేజారిందన్న దుఃఖంలో అతను తొందర పడి వుండవచ్చు. కాని సంయమనంతో ఆలోచించి నిర్ణయం తీసుకో వలసిన మంత్రులు, వున్నతాధికారులు ఒక చిన్న రాజకీయ వాదిని ఓదార్చడానికి ఇంత బరితెగింపు నిర్ణయాలు తీసుకోవడం ధర్మమా? ఉచితమా? ఎన్టీ రామారావు, ఆయన అల్లుళ్లు చాలా తొందర పడుతున్నారు. తమ కుల ద్వేషాన్ని నిస్సిగ్గుగా బయట పెట్టుకుంటున్నారు. ఈ వైఖరి వల్ల నష్టపోయేది వారొక్కరే కాదు - మొత్తం సమాజమే ఆ చేదును అనుభవించ వలసి వుంటుంది. ఆ నిజం వారెంత త్వరగా గ్రహిస్తే అంత మేలు.

## 50 ఏళ్ల క్రితం

3 పేజీ కొరవ

22వ తేదీ ప్రదర్శితమైన సంగీత `త్యాగరాజు' కృష్ణక విద్యయం తలపెట్టిన కార్యం పోషకుడు, సుహృన్మిత్రుడు అయిన చుండూరి వెంకట రామానుజం శెట్టి గారి ప్రోత్సాహం మూలంగా సఫలమైనది. కృష్ణ కవిద్యయానికి రజిత పాత్రలను, త్యాగబ్రహ్మము పాత్రధారి కె.యం. కృష్ణమూర్తి గారికి ప్రత్యేక రజిత పతకమును చుండూరు వెంకట రామానుజ శ్రేష్టి గారు బహూకరించిరి.

ప్రదర్శనం సుప్రసిద్ధ గాయనీమణి శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మ గారి ఆధ్వర్యాన జరిగింది. `ఆ జపేశయ్యే సాక్షాత్తు ఈ జపేశయ్య' అని పేర్కొని నటీ నటులందరి అభినయ చాతుర్యమును ఆమె ప్రశంసించింది.

రా.సా.యస్. మాలకొండారెడ్డి గారు (నెల్లూరు పబ్లిక్ ప్రాసిక్యూటర్) కృష్ణమూర్తి గారికి, మ్యూజిక్ అకాడమీ వారు కమలాదేవికి స్వర్ణ పతకముల బహూకరణను ప్రకటించిరి.

ఇది తమిళుల త్యాగబ్రహ్మ గారి తెనుగు కీర్తనలు పాడకూడదన్న తమిళ ఈ సాయి ఉద్యమ నిరసన ప్రచారార్థం రచింపబడిన నాటకం. కావున యీ నాటకాన్ని ప్రచారక దృష్ట్యా చూడవలె నంటారు.

### హిందూ - ముస్లిం

ఇందుకూరుపేట ఖాదర్ బీబి అను ముస్లిం యువతి ఆర్య సమాజం ద్వారా సుమలిగా మారి, వైశ్య శ్రీ పులిచి సుబ్రహ్మణ్యం గారిని 20 తేది వివాహమాడెను

## పంచాంగం

### ఏప్రెల్ తిథులు

చైత్రబహుళ

తే 29 శని అమావాస్య రా.గ. 9.51 వ

తే 30 ఆది పాడ్యమి రా.గ. 11.20 వ

### మే తిథులు

వైశాఖశుద్ధ

తే 1 సోమ విదియ రా.గ. 1.13 వ

తే 2 మంగళ తదియ రా.గ. 3.15 వ

తే 3 బుధ చవితి రా.గ. 5.21 వ

తే 4 గురు పంచమి పూర్తిగ

తే 5 శుక్ర పంచమి ఉ.గ. 7.00 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.-

# ప్రాణం కన్నా నటన ముఖ్యమా?

## కాదు కాని వృత్తి పట్ల శివాజీ గౌరవం అదీ!

"పశుంపొన" అనే తమిళ చిత్రంలో 15 రోజుల షూటింగ్ పూర్తి చేసుకొని మైసూరు నుంచి మద్రాసుకు కారులో తిరిగి వస్తున్న శివాజీ గణేశన్‌కు హఠాత్తుగా గుండె నొప్పి వచ్చింది. వెంటనే మద్రాసు అపోలో హాస్పిటల్‌లో చేర్పించారు. శస్త్ర చికిత్స ఎంత త్వరగా చేస్తే అంత మంచిదన్నారు వైద్య నిపుణులు. శివాజీ సరే అన్నారు. ఐతే, ఆ చిత్రం కోసం పెంచిన మీసం, గెడ్డాలను తీసివేయనన్నారు. "డైరెక్టర్ భారతీరాజా చిత్రం కోసం పెంచాను. ఆ 'పశుంపన్' చిత్రం షూటింగ్ అంతా అయిపోయినట్లే. కాని, ఎక్కడో ఒకటో అరో బిట్లు మిగిలిపోయి వుండొచ్చు. ఇప్పుడు నా మీసం గెడ్డం తీసేస్తే కంటిన్యూటీ పోతుంది. కొత్తగా నా ముఖం క్లోజప్ ఏదైనా తీయాల్సొస్తే, చండాలంగా వుంటుంది. అందుచేత, డైరెక్టర్ అనుమతి లేనిదే నేను మీసం, గెడ్డం తీయను" అని నిష్కర్షగా చెప్పేశారు. భారతీరాజా పర్సనల్ పనిమీద ఏదో ఊరికి వెళ్లారు. అందుచేత, ఆయన వచ్చేవరకు ఆగడమెందుకని గెడ్డం, మీసం తొలగించకుండా శివాజీకి ఆపరేషన్ సర్జన్‌లు విజయవంతంగా చేశారు. మర్నాడు మద్రాసుకు వచ్చిన భారతీరాజాకు ఈ సంగతి తెలిసింది. అపోలో హాస్పిటల్‌కు వెళ్ళి శివాజీ గణేశన్‌ను చూడగానే "ఏమిటండీ? మీకన్నా షూటింగ్ ముఖ్యమా?" అన్నారు బొంగురుపోయిన కంఠంతో. కంటిన్యూటీ కోసం మీసం గెడ్డం ఉంచాను. డైరెక్టర్ చెప్పనిదే నేనెలా తీసివేయగలను. వృత్తికి నేనిచ్చే గౌరవం అది అన్నారు శివాజీ హీనస్వరంతో. ఇంతటి గొప్ప నటుడ్ని ఎక్కడ చూడగలం? ప్రాణం కన్నా నటన ముఖ్యమా? అన్నారు భారతీరాజా.

### హనీమూన్‌కు ఆటంకం

"హనీమూన్‌కు మేము అంతరాయం కల్గించలేదుగాని, నవ




దంపతులు సంగీత దర్శకుడు రెహమాన్‌కు, ఆయన భార్యకు జ్ఞాపకం చేసి వచ్చాం" అంది సుహాసిని. భర్త మణిరత్నంతో ఈమె ఇటీవ కొడైక్కనాల్‌కు వెళ్లింది. "ఇందిరా-చిత్రం షూటింగ్ ముగిసిన సందర్భంలో నాకు రిలాక్సేషన్; బొంబాయి- సినిమా టెన్షన్‌తో మా ఆయన మణిరత్నంకు కాస్త విశ్రాంతి; మా బాబుకు ఆటవిడుపు. కాని, నేను డైరెక్ట్ చేసిన 'ఇందిరా' చిత్రానికి రీ రికార్డింగ్ జరగాలిగా? కొడైక్కనాల్‌లో రెహమాన్ దంపతులు బస చేసిన స్టార్ హోటల్‌కి వెళ్లాం. భార్యతో అలా షికారుకని బయలుదేరబోయిన రెహమాన్ రిసెప్షన్ దగ్గర మమ్మల్ని చూసి ముందు తెల్లబోయాడు. నేను ఏమీ చెప్పడానికి ముందే మద్రాసుకు రాగానే ముందు మా 'ఇందిర' చిత్రం రికార్డింగ్ పనే. గారంటీ మేడమ్! అన్నాడు అంది సుహాసిని.

### నిర్మాత అయిన 'విగ్గు'ల తయారీదారు

ఈ చిత్ర ప్రపంచంలో ఏ క్షణాన ఎవరు నిర్మాతలు అయిపోతారో ఊహించడం కష్టం. నటీ నటులకు విగ్గులు తయారుచేసే ఒక ఆసామి హఠాత్తుగా నిర్మాత అయిపోయాడు. ఆయనెక్కువగా కమలహసన్‌కు విగ్గులు తయారు చేసేవాడు. అందుచేత, ఆయన చిత్రంలో కమల్‌హసన్ ఉచితంగానే నటించడానికి ఇష్టపడ్డారు. ఈ చిత్రానికి దేవా సంగీత దర్శకుడు.

### రషీదాగా 'సిల్క్‌స్మిత'

నిర్మాతలలో చాలా మంది దృష్టి సంచలనం కలిగించే వార్తల పై పడింది. కేరళలో గుప్పుమన్న- విదేశాలకు రాకెట్ రహస్యాల విక్రయం త్వరలో తెరకెక్క బోతోంది. 'ప్రతినిధి' పేరుతో మలయాళ చిత్రంగా

(కొరవ 11 పేజీలో)


మంత్రాలమర్రిచెట్టు చిత్రంలో రాజ్‌కుమార్, యమున

# కమల్ ప్రక్కన ఛాన్సు- మీనా ఎదురుచూపు!

"ఇంతవరకు నేనెవర్నీ నోరు తెరచి వేషం అడగలేదు. నన్ను వెతుక్కుంటూ వచ్చిన వేషాలనే వేశాను. ఐతే, ఇటీవల ఒకే ఒక హీరోను వేషం అడిగాను. ఆయనెవరో చెప్పకోండి చూద్దాం!" అంది మీనా. కాస్సేపాగి ఆమే చెప్పింది. ఇంకెవరు కమలహాసన్‌గారే. ఆయన పక్కన ఇంతవరకు నేను హీరోయిన్‌గా నటించలేదు. ఆ విషయమే ఆయనతో అన్నాను. దానికాయన "తప్పకుండా. మనిద్దరికి తగ్గ స్టోరీ దొరకాలి ముందు. దృష్టిలో ఉంచుకుంటాను. అన్నారు. పరవశించి పోయాను. ఆయన దగ్గర్నుంచి ఎప్పుడు పిలుపు వస్తుందా? అని ఎదురు చూస్తుంటా" అంది మీనా.

### కమల్‌హసన్ సొంత చిత్రంలో అర్జున్

"కమల్‌హసన్ వంటి గ్రేట్ ఆర్టిస్టతో కలిసి ఒక చిత్రంలో నటించడమంటే పూర్వ జన్మ సుకృతం కాదా?" అన్నారు అర్జున్. కాస్సేపాగి వివరాలు ఆయనే చెప్పారు. తెలుగు చిత్రమే. పేరు "ద్రోహి" పదేళ్ళ అబ్బాయికి తండ్రిగా నటిస్తున్నాను. నాకు జోడి లేదు. మే, జూన్, జూలైలో షూటింగ్ అయిపోతుందన్నారాయన. ఆ తర్వాత ఆయన ఒక హిందీ చిత్రంలో ప్రధాన పాత్ర నిర్వహిస్తూ, దర్శకత్వం వహిస్తారట. సరసన మాధురీ దీక్షిత్ నాయిక.

# అన్ని హంగులు అందంగా అమరిన భలే బుల్లోడు!

**చిత్రసమీక్ష**
**గ్రిద్దలూరు గోపాలరావు**

కథ మంచి మెలికలతో మెచ్చుకో తగ్గ మలపులతో సరదాగా సాగుతుంది. మనసును రంజింప జేసే శృంగారం మిళితమై వుంది. సస్పెన్సుంది; విజనీ వుంది; పసిపిల్లలు మానసిక స్థితి గతుల వివరణ వుంది; హాస్య రసమూ కొద్దిగా వుంది. ఈ అంశాలన్నింటినీ తగిన మోతాదులో దర్శకుడు శరత్ అమర్చి చిత్రాన్ని వినోద భరితంగా రూపొందించాడు.

కృష్ణవరప్రసాద్‌కు (జగపతి బాబు) ఆడ వారంటే అసహ్యం. అందుకు కారణం అతని అన్నను, వదిన జయంతి (జయసుధ) చంపిందని అతని నమ్మకం. అతని నమ్మకాన్ని దృఢ పరుస్తూ కోర్టు హత్యా నేరం క్రింద జయంతికి జైలు శిక్ష విధిస్తుంది.

కృష్ణవరప్రసాద్ బ్రహ్మచారిగా వుంటూ బ్రహ్మచారి దేవుడైన ఆంజనేయ స్వామికి భక్త పరమాణువుగా నిలుస్తాడు. జైల్లో వున్న జయంతి తన బిడ్డ చిన్నను (విజి) ఆ జైల్లో పనిచేస్తున్న శాంతమ్మ (నిర్మల) కిచ్చి పెంచమని కోరుతుంది. తన జీవిత వాషాన్ని శాంతమ్మకు చెప్పుకుంటుంది. కొన్ని రోజుల తర్వాత దూరంగా ఒక బెంచీ మీద కూర్చొని వున్న కృష్ణ ప్రసాద్‌ను చూపి అతనే మీ నాన్న నువ్వు ఆయన వద్దకు వెళ్లు అని చెప్పి చిన్నను అతని వద్దకు పంపుతుంది శాంతమ్మ. చిన్న, కృష్ణవరప్రసాద్‌ను చేరుకుంటాడు. నాన్నా అంటాడు. పోరా దూరంగా అంటాడు కృష్ణ ప్రసాద్. ఎంత కసిరి కొట్టినా చిన్న అతని పంచనే పడుంటాడు. దాంతో కృష్ణ వర ప్రసాద్ చిన్నను ఆదరించక తప్పలేదు.

ఇది యిలా వుండగా బ్రహ్మచారిగా వున్న కృష్ణ వరప్రసాద్‌ను ఆట పట్టించేందుకు రాధ (సౌందర్య) అనే కాలేజి అమ్మాయి తన స్నేహితురాళ్లతో రంగ ప్రవేశం చేస్తుంది. అతన్ని ప్రేమించి నట్టు నటిస్తుంది. ఆ నటన నిజమైన ఘటనగా మారి కృష్ణ వర ప్రసాద్‌తో పెళ్ళికి సిద్ధమవుతుంది. అందుకు బ్రహ్మచారి అంగీకరించక పోవటంతో రాధ ఆత్మహత్యకు పూనుకుంటుంది. అప్పటికీ బ్రహ్మచారి చలించడు. అప్పుడు ఆంజనేయ స్వామి ప్రత్యక్షమై రాధను పెళ్ళి చేసుకో మంటాడు. రాధ, కృష్ణ వరప్రసాద్‌ల పెళ్ళి జరిగి పోతుంది. పెళ్లయిన తర్వాత కృష్ణ వరప్రసాద్ చిన్న అనే కొడుకు వున్నాడని రాధకు తెలుస్తుంది. దాంతో పడకటింటిలో కృష్ణ వర ప్రసాద్‌కు నానా యిబ్బందులు కలిగిస్తుంది. చిన్న తన కొడుకు కాదని కృష్ణ వరప్రసాద్ అతి కష్టం మీద నిరూపించు కుంటాడు. చివరన జయంతి నిరపరాధని తెలుస్తుంది. జైలు నుంచి విడుదలవుతుంది. [illegible]

(కొరవ 11 పేజీలో)



**జమీన్‌రైతు**

ప్రకటన రేటు

| | | |
|---|---|---|
| కాలం సెంటీమీటరు | రూ. | 18/- |
| లోపల 1/2 పేజీ | రూ. | 1710/- |
| మొదటి 1/2 పేజీ | రూ. | 3420/- |
| ఆఖరు 1/2 పేజీ | రూ. | 2565/- |
| Top - Box | రూ. | 360/- |

చందా పెంచలేదు:

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రూ. | 100/- |
| 1/2 సం. చందా | రూ. | 50/- |

చందాదారులకు జ్ఞాపకం:
ఏప్రిల్ 1 తేదీ నుండి చెల్లించ వలసిన చందా ఇదే చందా కార్డు అనుకొని దయచేసి వెంటనే M.O./ D.D. ద్వారా పంపి పత్రిక నిర్వహణకు సహాయపడ ప్రార్థన

- మేనేజర్

## నన్నయ్య ఒక పద్యం చెప్పిన భావం తిమ్మయ్య ఒక పదంలో చెప్పేశాడు!

# ప్రజాసామాన్యానికి సామీప్యం ద్విపదభారతం వైశిష్ట్యం!

(గత వారం తరువాయి)

ఇక అమూలక కల్పనలు పరిశీలిస్తే కవిత్రయ భారతంలో లేని కొన్ని సన్నివేశాలు సంభాషణలు ద్విపద భారత గ్రంథకర్తలు తమ గ్రంథంలో ప్రవేశ పెట్టారు. నన్నయ్య భారత సముద్ర మథన వృత్తాంతముక ద్రావిన తలకథలో హఠాత్తుగా తెల్పబడింది. తిమ్మయ్య ఈ సముద్ర మథన వృత్తాంతాన్ని ఒక మనోరంజక రమణీయ కావ్యంగా తీర్చిదిద్దాడు. సముద్ర మథన వృత్తాంతానికి పూర్వ రంగంగా దుర్వాస శాప వృత్తాంతాన్ని తిమ్మయ్య ప్రవేశ పెట్టినాడు. దీనివల్ల అమర లోక పతనం. దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్లుట. విష్ణు సందర్శనం బృహస్పతి రాయబారం అనే అంశాలు సమయోచితంగా కల్పించి కథకు రక్తిని కల్పించాడు. ఐరావతం ఎక్కి భూలోకానికి వచ్చిన ఇంద్రుని దుర్వాసుడు గౌరవించి పూలదండ వేశాడు. దానిని ఇంద్రుడు ఐరావతం మెడలో వేయగా అది తుమ్మెదల రొదకు దండను ధ్వంసం చేసింది. దానికి కోపగించిన దుర్వాసుడు ఇంద్రుని సంపదలు సముద్రపాలు అగుగాక అని శపించాడు. సర్వ సంపదలు కోల్పోయిన ఇంద్రుడు దేవతలలో బ్రహ్మను ఆశ్రయించి విష్ణు సందర్శనం చేశాడు. విష్ణువు సముద్ర మథనం చేయమన్నాడు. సముద్ర మథనానికి రాక్షసుల సహాయం అవసరం గనుక బృహస్పతిని రాక్షసుల వద్దకు రాయబారంగా పంపాడు.

"తోయధి మథియింప దొఱకు నమృతము ఆయమృతము ద్రావినంతనే మనము చావును దెవులును జరమును నెవ్వి భావింపగా రాక భాసిల్ల గలము మీరెల్ల ఈ కార్యమునకు తేదరుదు" అని ఆ జన్మ విరోధులైన రాక్షసులను త్రోవలోనికి తెచ్చుటకై బృహస్పతి నెరపిన రాయబారాన్ని ఒక కార్యవాది చేసే నైపుణ్యాన్ని ప్రదర్శిస్తుంది. ఈ సందర్భాన బృహస్పతి ప్రదర్శించిన ఓర్పు నేర్పు ఆతడు రాక్షసులతో చేసిన ఉపన్యాసములో తిమ్మయ్య చక్కని లోకజ్ఞత, వాక్య నిపుణత కార్య నిర్వహణా సామర్థ్యము ప్రదర్శించుట ప్రశంసనీయం.

పాండు రాజు వేటకేగిన సందర్భంలో నన్నయ్య "మృగయావ్యసనంబునదవిలి" అని సూచనా ప్రాయంగా చెప్పిన విషయాన్ని తిమ్మయ్య పాండు రాజు వేట కేగిన సందర్భాన్ని కొంత విపులీకరించి ఎరుకలు ఆటవికులు వచ్చి పాండు రాజుకు భక్తితో నమస్కరించి అరణ్యంలోని క్రూర మృగాల చేష్టలను విశదం చేస్తూ పాండు రాజు వేటకు ఏగుటకు కారణము కల్పించి విస్తరించుట ఇందలి వేట వర్ణన 75 ద్విపదలలో విస్తరించి మను చరిత్ర వేట వర్ణనతో సామీప్యము కల్పించి ప్రబంధత్వాన్ని రూపొందించాడు. ఇక కవిత్రయ భారతాన్ని ద్విపద భారత కవులు అనుకరించిన సన్నివేశాలు పరిశీలిస్తే దుష్యంత చరిత్రలో శకుంతల దుష్యంతుని కడకేగినపుడు రాజు అబద్ధమాడ తగదని సత్య వాక్యానికున్న ప్రాముఖ్యాన్ని తెల్పుతూ నన్నయ్య "తత్పుత్ర శతంబు కంటె ఒక సూనృత వాక్యము మేలు చూడగన్" అని చెప్పగా దీనిని అనుకరిస్తూ తిమ్మయ్య "ఆ సుతశతంబు నందు కంటె వాసిగా ఒక సత్యవచనంబు మేలు" అని భావ గమనాన్ని యథాతథంగా అనుకరించారు. ఈ అనుకరణలో సంస్కృత కావ్యానుకరణ ప్రబంధ కావ్యాను కరణయు కూడ గలదు. శకున్తలోపాఖ్యానంలో దుష్యంతుడు కణ్వాశ్రమ మృగాన్ని

> **ద్విపదభారతం**
> డాక్టర్ ఉడాలి నరసింహశాస్త్రి

చూచి బాణ ప్రయోగం చేయగా మహర్షులు ఇది ఆశ్రమ మృగము చంప వద్దన్నారు. ఈ సందర్భంలో తిమ్మయ కాళిదాస శకున్తలములోని "ఆర్త త్రాణాయ వః శస్త్రః నప్రహర్తుమనాగసి" అన్న భావాన్ని అనుకరిస్తూ "ధూర్తుల తెగటార్పదొడరు నీ బలిమి యార్తుల రక్షింప నందంబు గాదె" అన్నారు. అలాగే ద్రౌపదీ స్వయంవరంలో దృష్టద్యుమ్నుడు రాకుమారుల పరిచయం చేయు సందర్భాన్ని "మలయ జగంధి ఈ మత్స్యేశుజాడు మలవడ ముత్యాల హారముల్ వైచి" అను పద్య భావచ్ఛాయకు "వెలది ఐరావత ద్విపకుంభకుచ కుంభసంభావ హరిదధీశ్వరుని గొలుతో" అను శృంగార నైషధములోని దమయన్తీ స్వయంవర సన్నివేశాన్ని తిమ్మయ్య అనుకరించాడు. దీనివల్ల తిమ్మయ్యకు గల సంస్కృత నాటక లక్షణ జ్ఞానం ఆంధ్ర ప్రబంధ రచనా ప్రావీణ్యం వ్యక్తమౌతుంది. కవిత్రయ భారతాన్ని ద్విపద కవులు సంగ్రహించిన తీరు పరిశీలిద్దాం. తిక్కన ద్రౌపది కృష్ణునితో తన భంగపాట్లు చెప్పుకొనే సన్నివేశం ద్రౌపదీ మనోవేదనకు అద్దంపడుతూ 18 పద్యాలలో వర్ణించగా తిమ్మయ్య అందలి ముఖ్యాంశాలు మాత్రమే గ్రహించి "ఆలి బట్టిన దైత్యు హరియించె రాముడాలాగు తలపోయ రకట పాండవులు" అని తిక్కన తెలుపని క్రొత్త విషయం చెప్పారు. కుంతీ దేవి కుమారుని పొందినపుడు పొందిన ఆవేదన నన్నయ్య ఒక సీస పద్యంలో వర్ణించగా తిమ్మయ్య దానిని ఒక చిన్న వాక్యంలో "మూగ కన్న కలయమ్మె" అని సంగ్రహించి ఆమె దయనీయ స్థితికి అద్దం పట్టినాడు. ఇక అన్యథాకరణలో ఏకలవ్యుడు ద్రోణుడి వద్దకు విద్యాభ్యాసానికి రాగా నన్నయ్య "నిషాదుగా నెఱిగి శిష్యగా స్వీకరించ నన్నాడు" కాని తిమ్మయ్య ఈ ఘట్టంలో రాకుమారులకు ద్రోణుడు విద్యాభ్యాసం గఱపు సమయమున ఏకలవ్యుడు వచ్చినట్లు చిత్రించి "హీన జన్ముల కేల ఈ విద్య హాని పుట్టెడు వీనినను ఏపెద్రోణ" అని నిరాకరించినట్లు అన్యథాకరణం చేసాడు. దీనివల్ల గురువు ఆదర్శంగా ఉండాల గనుక విద్యార్థులే అతనిని నిషేధించ నున్నట్లు అన్యథాకరణ చేసి ద్రోణుడి యొక్క పాత్రకు ఔచిత్యము కల్గించుటలో ద్విపద కవుల కాలం నాటికి సాంఘిక పరిణామము ఊహింప వచ్చును.

వ్యాస భారత క్లిష్ట విషయాలను కవిత్రయం వారు పరిహరించినట్లు ద్విపద భారత కవిత్రయం గూడ కొన్నింటిని పరిహరించారు. అరణ్య పర్వంలో ఎఱ్ఱన ధర్మ వ్యాధుని చరిత్రను ఎనిమిది శీర్షికలలో తెలుపగా సోమన కౌశికుడు ధర్మ వ్యాధుని వద్దకు వెళ్లుట ధర్మ వ్యాధుడు కౌశికునకు అహింసా స్వరూపము చెప్పుట అను విషయాలు మాత్రమే గ్రహించి తక్కిన విషయాలు పరిహరించినాడు. ఆంధ్ర మహా భారత శాంతి అనుశాసనిక అశ్వమేధ పర్వాలలో యుద్ధానంతరం భీష్ముడు చేసిన ధర్మ ప్రసంగం తిక్కన ఆరు అశ్వాసాలలో చేయగా సోమన దానిని 4 అశ్వాసాలకు కుదించెను. ధర్మ ప్రసంగాలు, వేదాంత విషయాలు, వర్ణాశ్రమ ధర్మాలు సామాన్య జనుల అవసరం కానందున సోమన వాటిని పరిహరించెను.

ద్విపద భారత కవులలో లోక వృత్త పరిశీలన ప్రాముఖ్యం వహించింది కణ్వుడు శకున్తలను అత్తగారింటికి పంపు సందర్భాన రాజమర్యాదలు కౌరవ పాండవులను భీష్మాదులు చేసె విద్యారంభ సమయంలో ఇచ్చిన గురు దక్షిణ చేసిన వినాయక పూజలు, ద్రౌపది వస్త్రాపహరణ సమయాన కృష్ణ మహిమచే పర్వత రాసులైన చీరలను వెలిపట్టు, జిలుగు, తమ్మి విరుల చీరలుగా వర్ణించుట, విదురుడు కృష్ణునికిచ్చే ఆతిథ్యములో ఆంధ్రుల భోజన వంట కాల విశేషాలు స్వయంవర సభలో ద్రౌపదికి చేసిన అలంకరణలోని అలంకార సామగ్రి ఇవన్నియు నాటి సాంఘిక ఆచారాలకు దర్పణాలు ఇక వీరి పద ప్రయోగాది విషయాలు పరిశీలిస్తే మనోపేత, తపోన్నత మున్నగు సకారాంత పదాలను అకారాంతాలుగా గ్రహించి గుణ సంధి చేసియున్నారు. మధ్యమ పురుష ఇకార సంధిని వికల్పంగా గ్రహించారు. స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతాలకు సంధి లేక పోయినా సంధి చేసారు. ధర్మజుకు మున్నగు చోట్ల సగాగమంలేని షష్ఠివాడారు. వాక్య మధ్యలో విసంధి చేసిన ప్రయోగాలు చాలా ఉన్నాయి.

ద్విపదలో ఇంద్ర సూర్య గణాలే గాక లయ విన్యాసాన్ని గుర్తు పెట్టుకొని ఇంద్ర గణ స్థానాలలో మాత్రాసంఖ్య సరిచే చంద్ర గణాలు ప్రయోగించారు. ప్రాస యతిని విశేషంగా వాడారు. కళ్యాణ మాట ఘాతమాటలు మున్నగు వైరి మాసాలు వాడారు. ద్వంద్వ సమాసాలలో విలక్షణమైన వుపద్వావం చేసారు.

ఎల్లెరువు, కరము వేయుట, నిచ్చల్లు, గత పడ్డవారు, గడి కంటె చాడెలు, తావు కూళులు, రెండు వేల నాల్కల శాస్త్రి మున్నగు విశిష్ట పదాలు తమ కాలంలో వ్యవహారములో ఉన్నట్లు సృష్టించేశారు. "నక్క చిక్కలు" "కొఱ్ఱు మ్రింగిన యట్లు" "సూది వెంట సూత్రము సొచ్చినట్లు" మున్నగు దేశీయ పద బంధాలు పలుకుబళ్ళ ఉపయోగించి యున్నారు.

ఇక ద్విపద కవిత్రయ స్థానంలో బాల సరస్వతికి పెద్ద స్థానం లేదు అతని కవిత్వం పేలవమని సంస్కృత సాహిత్యాన్ని దేశ రచనలలో మలచే జ్ఞానం లేదని తిమ్మయ వద్ద ఉబుసుపోకకై కవిత్వం నేర్చినాడని సభాపర్వ రచన ప్రయోజన రహిత భావాలు చూచి తిమ్మయ సభాపర్వంతోనే అతనిని భారత రచన నుండి విరమింప చేసాడని విమర్శ కలదు.

మొత్తం మీద ద్విపద భారతం కవిత్రయ భారతానికి కేవలం అనుకరణ కాకుండ మార్గ కవితా మార్గములు నెదురొడ్డి తేటతెల్లమగు జాను తెనుగులో దేశి రచనగా వెలయించి ప్రజాసామాన్యమునకు భారత బద్ధ నిరూపితార్థమును సులభ శైలిలో అందించుటలో కృతస్నాతులై ద్విపద భారతానికి ప్రబంధ తాముద్ర నాపాదించుటలో కృత కృత్యులయ్యారనడం అతిశయోక్తి కాదు.

(కొరవ పై వారం)

అనిల్ బుక్ సెంటర్ సరస్వతి నిలయం ప్రారంభోత్సవ సభలో వాకాటి పెంచలురెడ్డి, ఒమ్మిన సుబ్రహ్మణ్యం, సిని సుబ్బరాయులు శెట్టి, వాసు.

## జనవాణి

3 పేజీ కొరవ

వెలువడిన తరువాత మాజీ ప్రధాని మొరార్జీ దేశాయ్ చనిపోవడం, మరికొన్ని సెలవులు రావడంతో బ్యాంకులు, పోస్టాఫీసులు వారం రోజుల పాటు పనిచేయ లేదు. ఇప్పుడేమో ఆఖరు తేదీ ముందుకొచ్చి నిలిచింది. జిల్లా నలుమూలల వుండే విద్యార్థులు బ్యాంకులలో డి.డి.లు తీసుకొని కోచింగ్ సెంటర్ వుండే పల్లెపాడు గ్రామానికి పోయేసరికి పుణ్యకాలం కాస్త సరిపోయింది. ఇంతలో ఇంటర్మీడియట్ ఫైనల్ కూడా వ్రాసిన విద్యార్థులు కూడా పరీక్షలు రాయను అర్హులనేసరికి రద్దీ మరింత పెరిగింది. ఈ విషయం రాష్ట్ర ప్రభుత్వం విచారించి మూడేళ్ల తరువాత నిర్వహిస్తు ఈ పోటీ పరీక్షకు దరఖాస్తు గడువు పొడిగించాలి.

సీతారాంపురం -ఇ. గోపీనాథ్

### పోస్టల్ శాఖ తీరు

పోస్టల్ శాఖ తీరును ఎంత దుయ్యబట్టినా తక్కువే అవుతుంది. శనివారం రావాల్సిన 'జమీన్‌రైతు' పత్రిక సోమ, మంగళ, బుధ, గురు, శుక్రవారాల్లో ఏదో ఒక రోజు వచ్చి చేరుతోంది. ఇదేమిటయ్యా అని పోస్టుమెన్‌ను అడిగితే నాస్తి శబ్దం. పత్రిక చదవాలన్న అభిమానం చంపుకోలేక నెల్లూరుకు వస్తున్న వారి చేత తెప్పించుకోవాల్సి వస్తుంది. పోస్టల్ శాఖ బట్వాడా విధానం ఇంత అధ్వాన్నంగా తయారైన సరిదిద్దే నాథుడే లేడు.

నాగమాంబాపురం -కె.ఎల్.కె. శర్మ

### జిల్లా ప్రాచీన చరిత్రను పుస్తకంగా తేవాలి!

జమీన్‌రైతు పత్రికలో ధారావాహికంగా నెల్లూరు జిల్లా పురాతన చరిత్ర పై వ్యాసాలు వ్రాసిన పురావస్తు శాఖాధికారి సాయి భక్త కేశవ గారికి, వాటిని సీరియల్‌గా ప్రచురించిన మీకు అభినందనలు. జిల్లా పురాతన చరిత్ర పై ఒక బుక్‌లెట్ తీసుక రావడానికి ఈ వ్యాసాలు ఎంతగానో వుపకరిస్తాయి. ఈ వివరాలకు జిల్లాలోని దర్శనీయ స్థలాల విశేషాలతో కూడిన ఫోటోలు జత కూర్చి ఒక పుస్తకం వెలువరిస్తే భావి తరాలకు ఉపయోగ పడుతుంది. ఈ విషయమై జిల్లా కలెక్టర్ అధ్యక్షతన నడుస్తున్న ఇంటాక్ సంస్థ కృషి చేయాలి. ఈ సంస్థ సభ్యులైన ఎస్.ఎస్. కృష్ణమూర్తి, పివి రామచంద్రరావులు జిల్లా చరిత్ర పై ఇది వరకే ఒక సంక్షిప్త పత్రాన్ని తయారు చేసి వున్నారు. ఇది ఇంటాక్ ఫైళ్లలో నిదురించే కన్నా జిల్లా ప్రజానీకానికి పుస్తక రూపంలో దర్శన మీయడం అవసరం. ఇంటాక్, జిల్లా పురావస్తు శాఖ, జిల్లా సమాచార శాఖ, సాంస్కృతిక మండలి తమ నిధులతో సంయుక్తంగా ఈ ముద్రణ చేపట్టాలి. ప్రపంచ సాంస్కృతిక వారసత్వ దినోత్సవం (ఏప్రెల్ 18), ప్రపంచ సాంస్కృతిక వారసత్వ వారోత్సవాలు (నవంబర్ 19) వుత్సవాలను ప్రభుత్వం మొక్కుబడిగా జరుపుతుంది. దీనికన్నా జిల్లా చరిత్ర పై అవగాహన, విషయ చింతన కల్గించే యీ చిరుపొత్త ముద్రణ చేపట్టడం సంభావ్యం. ఇది మన సాంస్కృతిక వారసత్వ పరిరక్షణకు దోహద పడుతుంది.

విశాఖపట్నం -ఎం. రామమూర్తి

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

అల్లూరు, ఉదయగిరి, గూడూరు, రాపూరు ఎమ్మెల్యేలు జె.సి. ఎం.ఆర్. నాయక్, ఐ.ఓ.పి. సి.ఆ.పి. బ్రహ్మేంద్ర రావు పంచాయితి రాజ్ ఎస్.ఇ. బి. వెంకయ్య తదితరులు పాల్గొన్నారు.

**అసంపూర్ణ మద్య నిషేధానికి నిరసన!**

ప్రభుత్వం అసంపూర్ణ మద్య పాన నిషేధాన్ని విధించడం పట్ల బ్రాంది షాపుల వ్యతిరేక ఐక్య కార్యాచరణ కమిటీ నిరసన వ్యక్తం చేస్తోంది. మద్య నిషేదం నుండి 3 స్టార్, 5 స్టార్ మినహాయించడం, కల్లు పట్ల వుదాసీనత, విదేశీయులు, సైనికులు, డాక్టర్ సర్టిఫికెట్ వున్న వారికి రాయితీలు ఇవ్వడాన్ని నిరసిస్తుంది. ఈ విధానాల పై దశ వారీ ఆందోళన ఒక కార్యాచరణ పథకాన్ని రూపొందిస్తున్నట్లు గంధవరపు సేతురామ రెడ్డి గారు తెలియ జేస్తున్నారు.

### రాష్ట వకీలు గుమాస్తాల సంఘ సమావేశం!

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట వకీలు గుమాస్తాల సమాఖ్య సర్వ సభ్య సమావేశం మే 27 తేదీ ఆంధ్ర సభ హాలులో జరుగుతుంది. జిల్లా జడ్జి ఎల్. అప్పారావు ముఖ్య అతిథిగా విచ్చేసె సమావేశానికి సమాఖ్య రాష్ట అధ్యక్షుడు గంటి నాగేశ్వర రావు అధ్యక్షత వహిస్తారు. నెల్లూరు పట్టణ సంఘానికి 20 ఏళ్ల నుండి అధ్యక్షునిగా వున్న జి. సత్యనారాయణను ఈ సందర్భంగా సన్మానిస్తారు. రాష్ట వ్యాప్తంగా వకీలు గుమాస్తాల సమస్యల గూర్చి చర్చిస్తారని గుళ్ళపల్లి సత్యనారాయణ, అన్నపరం సత్యనారాయణ గారలు తెలుపుతున్నారు.

### ఆది శంకరుని జయంతి

జగద్గురు ఆది శంకరుని జయంత్యుత్సవాలను పినాకినీ విద్యా పీఠం మే 4 తేదీ నుండి 8 వరకు టి.వి.ఎస్. కళ్యాణ మంటపంలో ఏర్పాటు చేస్తుంది. మూడు రోజుల పాటు పురయుం పూట వేద పారాయణ శ్రీదేవి, శివ, విష్ణు అభిషేక సహస్ర నామ పూజలు జరుగుతాయి. సాయంకాలం ఆధ్యాత్మిక ఉపన్యాసా లుంటాయి. 4 తేదీ 'శ్రీ శంకరుల ఆత్మ బోధ' అంశంపై గలపావులూరు కామేశ్వర రావు, 5 తేదీ జగద్గురు శంకరుల విశిష్టతను విశ్వనాథ శ్రౌతులు, 6, 7, 8 తేదీల్లో అవతార ప్రయోజనాలు, సూత్ర బాష్యాలు, ఉపనిషత్ ప్రస్థానియ ఆకెళ్ల సీతారామ శాస్త్రి వివరిస్తారు. భక్తి పరులన తరలి రమ్మంటున్నాడు స్వయంపాకుల శ్రీనివాసులు.

### ముస్లింలకుఉచిత ఖత్నా

సింహపురి మైనారిటీస్ వెల్ఫేర్ అసోసియేషన్ అధ్వర్యంలో పేద ముస్లిం బాలురకు ఉచిత వడుగులు (ఖత్నా) కార్యక్రమం నిర్వహిస్తున్నారు. 30 తేదీ జండావీధిలోని పి.ఎస్.ఎం. హై స్కూల్ ఆవరణలో ఈ కార్యక్రమం జరుగుతుంది. వడుగులు చేయించు కోదలచిన వారు ఖాసిం బాషా, అమీనియా మసీదు ఎదురు, కోట మిట్ట నెల్లూరు వారిని సంప్రదించవచ్చును.

### ఖాళీ కుండలతో ప్రదర్శన

టౌన్‌లో మంచి నీటి సమస్యను పరిష్కరించాలని డి.వై.ఎఫ్.ఐ. ఖాళీ కుండలు ప్రదర్శన నిర్వహించింది. గాంధీ విగ్రహం వద్ద నుంచి ప్రారంభమైన ప్రదర్శన ట్రంకురోడ్డు మీదుగా మునిసిపాలిటీ కార్యాలయా నికి చేరుకొంది. ఛేర్మన్ వివేకానంద రెడ్డికి వినతి పత్రం సమర్పించారు. ప్రదర్శనకు డి.వై.ఎఫ్.ఐ. జిల్లా కార్యదర్శి ఎం. మోహన రావు నాయకత్వం వహించారు.

## సాయిబాబా మందిరంలో వివేకాకు సన్మానం!

సాయిబాబా మందిరంలో 23 తేదీ మున్సిపల్ చేర్మన్ ఆనం వివేకానంద రెడ్డిని సాయిభక్త మండలి ఘనంగా సన్మానించింది. స్వతంత్ర పార్కు వద్ద నుండి మేళతాళాలతో, పూర్ణకుంభంతో స్వాగతం పలికి ఆలయంలోనికి తీసుకెళ్లారు. ప్రత్యేక పూజల అనంతరం పల్లకీ సేవ జరిగింది. స్వామి వారి పల్లకిని ఆనం వివేకానంద రెడ్డి స్వయంగా తన భుజాల పై పుంచుకొని మోసారు. అనంతరం జరిగిన అభినందన సభకు సాయిభక్త మండలి అధ్యక్షుడు శ్రీ ఎ.వి. కృష్ణారెడ్డి అధ్యక్షించారు. సాయిభక్త మండలి కార్యదర్శి శ్రీ పత్రి రమేష్ బాబు, కోశాధికారి శ్రీ మన్నెం అమర నాథ రెడ్డి, జాయింట్ సెక్రెటరీ పి. సుధాకర రావు, ఎ. శ్యామసుందర రెడ్డి, జి. సతీష్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### వివేకా అభినందన సభ!

టౌన్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ ఎసినగర్ మునిసిపల్ హై స్కూల్ వద్ద ఛేర్మన్ వివేకానంద రెడ్డి అభినందన సభ ఏర్పాటు చేసింది. తనను ముందుగా కౌన్సిలర్‌ను చేసి రాజకీయాల్లో వచ్చే టట్లు చేసిన ఎసినగర్ వాసులకు మరవ లేనని వివేకానంద రెడ్డి చెప్పారు. కార్యక్రమంలో మాజీ మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి, కౌన్సిలర్ విజయకుమార్ నాయుడు కూడా పాల్గొన్నారు. సభానంతరం అరుణమ్మ వివేకాకు ఉపాహార విందు ఏర్పాటు చేసి తన అభిమానాన్ని చాటింది.

## సమీక్ష

9 పేజీ కొరవ

మవుతుంది. ఎం.డి. సుందర్ వ్రాసిన కథ ఇది.

చిన్న, కృష్ణ వరప్రసాద్‌ల మధ్య సాగిన మాటలు, సన్నివేశాలు, సరదాగా వున్నా రాధ, కృష్ణ వరప్రసాద్‌ను ప్రేమించినట్లు నటించి ఆట పట్టించిన చిలిప చేష్టలు పడకటింటిలో రాధ పెంకి తనం శృంగార పరంగా, గిలిగింతలు పెట్టాయి. బాబూమోహన్, జయలలిత హాస్యం కొంత ఆనంద పరుస్తుంది.

జగపతి బాబు, బ్రహ్మచారి వ్రతంలోను, శృంగారంలోను, డాన్సుల్లోను, ఫైట్సుల్లోను మెరుగ్గా కనిపించాడు. సౌందర్య శృంగారం మనోరంజకంగా వొలక పోసింది. జయసుధ, కోట శ్రీనివాస రావులు గొప్ప నటులు. వారి నటనకు తగ పాత్రలు వారికివ్వలేదు. ఉన్నంతలో తమ గొప్పను నిరూపించు కొన్నారు. అందరి కన్నా చిన్న అనే పిల్లాడు పాత్రలో కనిపించిన ఆడపిల్ల విజి మిన్నగా నటించింది.

తనికెళ్ల భరణి మాటలు సరదాగా సాగాయి. వేటూరి, భువన చంద్ర పాటలు కోటి సంగీతంలో హాయిగా వినిపించాయి. సుధాకర్ రెడ్డి ఫోటోగ్రఫీ బాగుంది.

## ఒక గురువు-ఒక శిష్యుడు

- 'రసిక్'

పబ్లిక్ పరీక్షలే కదా ఇవి
పబ్లిక్‌గా ప్రశ్నపత్రాల నమ్మి
లాభం గడిస్తే తప్పేమిటన్న ఊహాగానాలు
శుభ్రంగా ఇంత పని చేసి పట్టుబడి
కటకటాలను లెక్కపెట్టుతున్నాడు
ఓ విద్యాధికుడైన ప్రధానోపాధ్యాయుడు-

* * *

'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అన్న తిలక్ పలుకుతో
స్ఫూర్తి పొంది, దాన్ని మరింత విస్తరించి
'కాపీకొట్టడం నాజన్మహక్కు' అని బాహాటంగా ప్రకటించి ఆ
హక్కుకు, తన 'భవిష్యత్తు'కు
అడ్డు నిలిచిన ఓ ఉపాధ్యాయుడ్ని
అమాంతం చంపేసి, చెఱసాల పాలై
'కూడు - గుడ్డ-గూడు'లకు అవస్థలేకుండా
ఏర్పాటు చేసుకొన్నాడొక దీర్ఘదర్శి విద్యార్థి-

* * *

ఈనాటి విద్యారంగానికి
ఈనాటి పరీక్షావ్యవస్థకు
ఆ గురువు, ఈ శిష్యుడూ
వీళ్లేకదా ఎన్నదగ్గ
ఉత్తమోత్తమ దర్పణాలు
అన్ని విలువలకూ తర్పణాలు.

## సినిమా

9 పేజీ కొరవ

తయారౌతోంది. శాస్త్ర వైజ్ఞానికులను లొంగదీసుకున్న రపీదాగా సిల్కుస్మిత నటించబోతోంది. ఈ చిత్రం కూడా "బొంబాయి' చిత్రంలాగే సినిమారంగంలో ఒక్క ఊపు ఊపొచ్చు. ఇతర భాషలలో డబ్బింగ్ హక్కుల కోసం చాలా మంది పోటీలు పడుతున్నారు. యదార్థ సంఘటనల ఆధారంగా తయారవుతున్న ఈ చిత్రానికి పలుచోట్ల నిరసన తెల్పబడుతుందన్న భయం నిర్మాతలలో ఏ కోశానా లేదు. రెండు మూడు కత్తిరింపులతో ఆమోదించడానికి రివైజింగ్ కమిటీ ఉందనే వుంది కదా? ఆ మొండి ధైర్యంతోనే స్పీడ్‌గా చిత్ర నిర్మాణం జరుగుతోంది!

### "ఆడదొంగ"

విజశాంతి నాయికగా నటించే "ఆడదొంగ" చిత్రానికి 14 వ తేదిన ఎ.వి.ఎం. స్టూడియోలో ప్రారంభోత్సవం జరిగింది. రచన: పరుచూరి సోదరులు; సంగీతం: బప్పిలహరి; ఈ సినిమా స్కోప్ చిత్రం తమిళంలోనూ తయారౌతున్నది.

### నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

శ్రీ అఖిలాండేశ్వరి ఫిలిమ్స్ "రౌడీయముడు"; సాయిరాం ఆర్ట్ ప్రొడక్షన్స్ "రౌడీ మినిస్టర్"; వి.వి. ఆర్. ఫిలిమ్స్ "రాకాసి"; బాలాజీ ఎంటర్ ప్రైజెస్ "గుండా రాజకీయం"; సాయిరాం ఆర్ట్ ప్రొడక్షన్స్ "హిట్‌లిస్ట్"; శ్రీ సాయిలక్ష్మి సినీ ఎంటర్ ప్రైజెస్ "వగలాడి"; శ్రీ సాయిరత్న ఇంటర్నేషనల్ "పెళ్లానికి పెళ్లాం"; విజయగణపతి మూవీస్ "కిడ్నాప్"; యువరత్న ఆర్ట్స్ "రాయలసీమ రక్తం"; అఖిలాండేశ్వరి ఫిలిమ్స్ "పోలీస్ ఎంక్వయిరీ"; వి.వి.ఆర్. ఫిలిమ్స్ "సాహసయాత్ర"; బాలాజీ ఎంటర్ ప్రైజెస్ "స్మగ్లర్స్"; సాయి సూర్య ఫిలిమ్స్ "డ్రగ్స్ అండ్ ఎయిడ్స్"; విజయలక్ష్మి ఆర్ట్ మూవీస్ "మొగుడా మజాకా?" విశా మూవీస్ "తొరానిక్ టౌన్"; సుచిత్ర కంబైన్స్ "దొంగచూపులు"; గాయత్రిమా ఫిలిమ్ క్రియేషన్స్ "కోటిపల్లి దాదా"; అఖిలా ఆర్ట్స్ "ఛాలెంజ్, ఎవడైతే నాకేటి?" ఎస్.వి.డి. ఆర్ట్స్ "నీను వీడని నీడను నేను"; నంది ఫైన్ మూవీ మేకర్స్ "శాసన కర్త"; స్పందనా ఆర్ట్ మూవీస్ "బ్లాక్ మార్కెట్"; వాయుపుత్ర క్రియేషన్స్ "అతిథి"; వర్మ క్రియేషన్స్ "చార్మినార్"; సన్‌రైజ్ ప్రొడక్షన్స్ "కాలేజ్ స్టూడెంట్"; సృజనా మూవీస్ "డియర్ బ్రదర్"; ఆర్.వి.మూవీస్ "మా దేవుడు [illegible] మాస్టారు"; 21 సెంచరీ మూవీస్ "మంజరి"; నందిఫైన్ మూవీ మేకర్స్ "పసిడి కిరణం";

## శుభశకునం

4 పేజీ కొరవ

నిబంధనల షస్త్రకాన్ని చూపిస్తూ; ఛైర్మన్ అనుమతించక పోతే రాజీనామా చేస్తానన్నారు. సంధానీ...కష్ట పడి గెల్చావు. పూరో రాజీనామా చేస్తే ఎలానని వివేకా ఆయనకు నచ్చ చెప్పడంతో శాంతించారు.

మున్సిపల్ నాల్గవ తరగతి సిబ్బంది కొబ్బరి నూనె రెండు లక్షల 30 వేలు ఖర్చు పెట్టి వైద్యశాలల్లో మందులకు కేవలం 80 వేలు కేటాయించడం అన్యాయం అధ్యక్షా అని కౌన్సిలర్ కనకయ్య వాపోయ్యారు. కొబ్బరి నూనె బడ్జెట్ కార్మికుల హక్కు అని ఛైర్మన్ ఆయనను సమాధాన పర్చారు. కోతులు, కుక్కలు పట్టేందుకు 50 వేలు కావాలంటున్నారు, అసలు వాటిని పట్టడం లేదని సిపిఎం సభ్యుడు పున్నం బసవయ్య ఫిర్యాదు చేశారు. సిబ్బంది యూనిఫారంలకు 7 లక్షలు, పాదరక్షలకు లక్షా 50 వేలు ఖర్చు పెట్టినా వాటిని వారు ధరించడం లేదని చాట్ల నరసింహా రావు, ఊటుకూరు లక్ష్మయ్య పేర్కొన్నారు. యూనిఫారం ధరించని సిబ్బందికి హాజరు వేయమని మునిసిపల్ కమీషనర్ రామసుబ్బారెడ్డి సమాధాన పరిచారు. దోమల నివారణ యంత్రం రిపేర్లకు లక్ష రూపాయలు ఖర్చు పెడుతుండగా అది అన్ని ప్రాంతాలకు రావడం లేదని కౌన్సిల్ వనజాక్షి ఫిర్యాదు చేసారు. మే నెల నుంచి పట్టణంలో ఒక పద్ధతి ప్రకారం దానిని నడుపుతానని ఛైర్మన్ సమాధాన పరిచారు. ఇళ్ళలో వేసే లైట్లు ఎక్కువ తరబడి వస్తాయని మునిసిపాలిటీలో వేసిన లైట్లు ఏ విధంగా కాలిపోతున్నాయో విచారించాలని అందువల్ల ఐ.ఎస్.ఐ. మార్కు కలిగిన వాటినే కొనమని పలువురు సభ్యులు సూచించారు. మునిసిపల్ విద్యుత్ సామగ్రి దుర్వినియోగం కాకుండా సామగ్రి పై ఎన్.ఎం.సి. ముద్ర వేసేలా సంబంధిత కంపెనీలను కోరుతానని ఛైర్మన్ నచ్చ చెప్పారు.

విజయ మహల్ బ్రిడ్జికి సంబంధించిన అప్రోచ్ రోడ్ల విషయమై సిపిఎం సభ్యుడు పున్నం బసవయ్య మాట్లాడుతూ ఇండియన్ రోడ్ల శాఖ నియమాలకు వ్యతిరేకంగా రోడ్లను తక్కువ వెడల్పుతో నిర్మిస్తున్నారని ఆరోపించారు. ఫిబ్రవరి నెల నాటికి రోడ్ల నిర్మాణం పూర్తి చేస్తామన్న రోడ్ల అధికారులు మాట నిలబెట్టు కోలేదన్నారు. అక్టోబర్ 2 లోగా పూర్తి చేసి తానే ప్రారంభోత్సవం చేయిస్తానని వివేకా ఈ సందర్భంగా హామీ ఇచ్చారు. మైకులు తగినన్ని లేక పోవడం, అంజెండా కాపీలు సరిగ్గా అచ్చు వేయక పోవడం సభ్యులు ఇక ముందు జరుగకుండా సరిదిద్దమని కోరారు. 15 మంది మహిళా కౌన్సిలర్లు తమకు ప్రత్యేకంగా ఒక గది కావాలని మిగతా కౌన్సిలర్ల మద్దతుతో ఛైర్మన్‌కు కోట లక్ష్మీకుమారి ద్వారా ఒక అభ్యర్థన ఇచ్చారు. అభ్యర్థనలని తనను సంతకం చేయించక పోవడం పట్ల వివేకా బాధ పడుతూ నన్ను హి నుండి వేరు చేయవద్దని కోరారు. 1995 - 96 సంవత్సరానికి సవరించిన బడ్జెట్ అంచనాలను కౌన్సిల్ ఆమోదించింది. బడ్జెట్ ప్రారంభ నిల్వ 84, 16, 161 రూపాయలతో కలిపి మొత్తం ఆదాయం 12,98,60,072 రూపాయలుగా అధికారులు బడ్జెట్ అంచనా రూపొందించారు. 96 మార్చి 31 వరకు నాటికి ముగింపు నిల్వ 36, 78, 080 రూపాయలుగా పేర్కొన్నారు. సింహపురి టాక్స్ పేయర్స్ అసోసియేషన్ సభ్యులు హై కోర్టుకు వెళ్ళి మధ్యంతర ఉత్తర్వులు పొంది 25 రూపాయల కొళాయి పన్ను చెల్లిస్తున్నా రన్నారు. అదే మాదిరి మిగతా ప్రజలు చెల్లించేలా ప్రభుత్వం అనుమతి ఇవ్వాలని కౌన్సిల్ తీర్మానించింది. సమావేశానికి ముందు వివేకా సభ్యులందరికి కార్యాలయంలోని వాటర్ ట్యాంకుల క్రింద విందు ఏర్పాటు చేసి కొసరి కొసరి మరీ వడ్డించారు. 30 వార్డు కౌన్సిలర్ దేవరాజులు, ఎక్స్ అఫిషియో సభ్యులైన ఎమ్మెల్యేలు హాజరు కాలేదు.











Edited, Printed and Published by Nellore Dolendra Prasad at Zaminryot Press, Offset Printing at Nayagara Paper Products (I) Ltd